# శ్రీ గిరిజా కళ్యాణము

[మంజరీ ద్విపద గీతములు]



కవికులగురువు

మహాకవి కాళిదాస కృతియైన

కుమార సంభవము

ననుసరించి

వ్రాయబడిన మంజరీ ద్విపద గీతములు



కూర్పు :

పి. దుర్గారావు, యం.ఓ.యల్.

అక్షయనామ సంవత్సరము
వసంతము - వైశాఖము.

1986-మే.



ప్రథమ ముద్రణము - 500

మూల్యము : రు. 10-00

ముఖచిత్రం : పాతూరి కృష్ణారావు, (B.Sc.) నల్లగొండ.

ముద్రణము : "వెంకటరత్నా" విజయవాడ.

---

ప్రతులకు :—

పి. దుర్గారావు, యం.ఓ.యల్.
చెరుకుపల్లి పోస్టు,
కేతేపల్లి మండలము (వయా నక్రేకల్)
నల్లగొండ జిల్లా.

# వినయ వాక్యము

కవికుల గురువైన కాళిదాస కవి
రచియించి నట్టి యా రమణీయమైన!
నవరస భక్తి "కుమారసంభవ" మనెడి
కడు రమ్య కావ్యంబు కమనీయమైన!
మల్లినాథుని వ్యాఖ్య మహిమాన్వితంబు
నొప్పు మహోన్నతి నోరగా నాడు!
పలుకుల భావాల బరగ గూర్చుచును
సప్త సర్గంబులు సరిగమల్ రీతి
పాటగా బాడితి బంగారు బాట!

అజ్ఞానుడను నేను నత్యంత జడుడ
మాటలు రానట్టి మ్రానట్టి వాడ!
సంస్కృతాంధ్రంబులు చక్కగా రాని
సంస్కార రహితుడ సాధు మార్గముల!
భువి కీర్తి నొందిన పూర్ణమైనట్టి
కాళిదాసుని మహా కల్పంబు నను!
స్పృశియింప దలచితి చిత్రంబు గాద!
వ్రాయగా దలచితి వన్నెలను జిందు!
అతి సాహసంబున కలరిన నన్ను
క్షమియింపగా మిమ్ము సన్నుతి జేతు!
కవుల బండితులను కరములు మోడ్చి
అంజలి ఘటియింతు నలరు మల్లియల!
తప్పొప్పులున్నవి తగ బహుళముగ
మన్నింప వేడెద మహిమాన్వితులను

దోసముల్ జూచుచు దూషింపవలదు
పాండిత్యమును జూప బహునేర్పు కూర్పు!
జూపగా వ్రాసిన చోద్యంబు గాదు!
జిలిబిలి బల్కుల జిన్నారి నుడుల!
భక్తిభావముతోడ భవ్యపరమేశు!
ఆలోక కళ్యాణి యా శివరాణి!
వ్రేసు గాథను వ్రాయ బ్రీతి గొల్పగను!
వ్రాసితి నీ రీతి వన్నెలు జింద!

ఆ పరంజ్యోతికి యంజలులతోడ
నతని గాథను నిదే! యర్పితంబనుచు!
నర్పించుచున్నాడ యాశలు లేక
మంగళంబులతోడు మాధవ యనుచు!

కవికుల గురువైన కాళిదాసకవి
స్మరియించుచున్నాడ నన్నతిమీర!
నన్నయాది కవుల నటకవి వరుల
భక్తిని బూజింతు భావనజేసి!

ఏ మహనీయులు నీ కథ వ్రాసి
తిరియించినారో యా ధన్యులందఱిని!
పదముల మతితోడ సాష్టాంగములను!
నర్పింతు! బూజింతు! నందాల పూల!

# శ్రీ గిరిజా కళ్యాణము

## ప్రథమాశ్వాసము

## (పార్వతీదేవి జన్మవృత్తాంతము)

అన్నపూర్ణను నద్ది యఖిల సస్యముల
పలరు బంగరు భూమి యీ భారతమున!
ఉత్తరంబున యున్నతంబయిన
యుత్తమాపథముల కునికి పట్టయిన!
హిమ పర్వతంబను యిలను జేరొండ
యిమ్మహీధరముల కింద్రుడై వెలసె!
పూర్వ పశ్చిమముల పొంగు సంద్రముల
బొలుపుగా జొచ్చుక బొడిచిన రీతి!
మహిని గొల్చెడి యట్టి మానదండముగ
మహిమాన్వితుండుగా మన్నన వడసె!

కొండలు హిమవంతు గూర్మితో నపుడు
గోరూప ధరణికి గూర్చి వత్సముగ!
మేరు పర్వతమును మేపు గొల్లనిగ
మేలిమి రత్నాలు మేటి యోషధులు!
పృథువు చెప్పినరీతి పిదికించి రపుడు!
పొగడగా నశమె యీ పొలుపొందు గిరిని!

సకల సద్గుణముల నాకరంతునకు
వాక్కు దోసంబున్న లెక్కవెట్టుదురె?
పదునారు కళలను జలధిజ చంద్రునికి
కలిగిన మచ్చను గాంచి యెన్నుదురె?
రత్నప్రభ శోడ రాజిల్లు గిరికి
మంచొక దోసమా మహిమాన్వితునకు?

హిమగిరి శిఖరాన యింపులు నొలుకు
సి దూర ద్రవ్యముల్ చిందిది యాకసము!
సంధ్యా లకాలంబు జయ్యన జూప
ప్రియు సమాగమువేళ ప్రీతి నా యొసని!
కిన్నెర కాంతలు కిన్నెల సారి
దొట్రుబాటున నగల్ దొడిగి మార్చుచును!
ఆరాటముం జెంది యరుదు రేఘడు
కీర్తింప గంమె యా గిరిరాజు కీర్తి?

ఉన్నతుండైన యా యద్రీశ్వరునకు
మన్యగా దారాడు మహిత మేఘములు!
చల్లని చరియల జలదాల క్రింద
శిఖలు నివసింత్రు శిఖ తలంబులను!
శ్వరముల్ సడిరాగ సడలి యా చరియ
లెరుగు కాంతులు గను యాంబరోధి!
గిరి శృంగముల జేరి కీర్తింత్రు పరుని
జపముల దపముల జరియుంతు రచట!

గజములు సింహముల్ గలవు నా కొండ
నానామృగంబుల నాభి గా గిరులు!
గజముల కుంభాలు గడవేత్ర జీరి
హరుల గోళ్లను రాలు నందు ముత్యములు!
దారుల బోదురు దండింప హరుల
వేటాడు బోయలు విరివిగా గలరు!

విద్యాధరులు కది వేడుకా భూమి
దివిజ కాంతలు దాని దివిగ భావింత్రు!

పొలుపారు నెట్టి భూర్జపత్రముల
సింధూర ద్రవ్యాల జిత్రాక్షరముల!
విద్యాధరాంగనల్ వేడ్క మీర
బ్రియులకు పంపింత్రు బ్రేమ లేఖలను?
వర్ణింప గలుగునా వాగీశ్వరుండు?
కీర్తింప దరమె యా గిరిరాజు మహిమ?

ఎత్తయిన యా గిరి నింపొందు గుహలు
మధుర గీతములచే మార్మ్రోగుచుండు!
కిన్నెర సతులట కిన్నెరల్ మీటి
గాంధార రాగముల్ గలిసి పాడుదురు!
కీచక రంధ్రముల్ వీచు గాలులను
సరిగమ పదనిస సస్వరల్ రాగ
హిమవంతుడును గూడ నమల కంఠమున
శ్రుతిగల్పినట్లుండు సుందర ధ్వనుల!
చెక్కిళ్ళ గండూలి చెదరి పోవుటకు
దేవదారుల చెంత ద్వీపములు జేరి!
రాపిడి సలుపగా రయమున జెట్ల
కొమ్మల రెమ్మలు, జిమ్మినా పాలు!
మధుర సువాసన మాధుర్యములను
జరియలన్నియు నిండి విరియుచునుండు!

సుందరంబయిన యా సురుచిరంబైన
ఎత్తయిన యాకొండ నింపొందు గుహల!
వనముల జరియింత్రు వన కిరాతినులు
పక్షులతో గ్రీడింత్రు సాంద్ర సౌఖ్యముల!

ఓషధుల కాంతులే యొనర దీపములు
సురత సౌఖ్యములను దేలుదు రుంద్రు!
తృణజ్యోతి కాంతులే తేజస్సులగును
గజదంత కాంతుల గ్రక్కుచు నుండు

గడ్డకట్టినమంచు గప్పిన మార్గముల
నడువ వెట్టరాని యతి చల్లదనము!
కాలి వ్రేళులు మడమ గలచిన మంచు
బాధ సహింపంగ వలతురు గాని!
ఉరు పయోధరములు, నున్నత శ్రోణి
బరువు భారములను భరియింప లేరు!
కిన్నర సతులట సన్నంపు జిలుక
మందగమనము వీడ మదినోర్వ లేరు!

పగటికి భయపడి పరుగున వచ్చి
శరణన్న జీకటినే దయ్యాన బ్రోచి!
గుహాలందు నివసింప గూర్మితో దాను
నాశ్రయం బిచ్చిన యమల భావకుడు!
ఉన్నతులైనవా రుర్విలో జూడ
క్షుద్రులైనను వేడ నార్ద్రచిత్తమున!
సజ్జనులకు బోలె సంరక్ష జేసి
కరుణ బ్రోతురుగదా! కమనీయ గతుల!

చమరీ మృగంబులట నయ్యాట లాడు!
నటునిటు గదిలించి యల్లార్చుకొనుచు!
చంద్రకాంతుల బోలు సందాలు జిందు
వాలముల్ వింజామురలు పట్టు దోచు!

గిరిరాజు శబ్దంబు సార్థకము సేయ
వింజామరలు మబ్బు విసరుచున్నవా కో!

ఆకాశమును నంటు నా పర్వతమున
కింపురుషాదులు క్రీడింతు రచట !
గిరిగహ్వరంబున క్రీడించు సఖులు
సఖియుల జేరెలం జయ్యైన లాగ!
కింపురుషాంగనల్ కిన్కను జూప
లజ్జ బాపగా లాలిత్య మలర!
గుహాద్వారములయందు గాఢంబుగాగ
దెరలుగా మేఘాలు దేలుచునుండు!

ఆ మహా నగమున యా కిరాతకులు
వేటాడ మృగముల వెదకుచు నలసి!
తూగి గంగానదీ తుంపురు లంది
సరళ వృక్షంబుల సామీప్య మొంది!
బర్హి పింఛంబుల బడి తృణమాగు
మంద మందములైన మధుర వాయువుల
సేవించుచుందురు చింతలం బాయ
శ్రమ దీర్చుకొందురు సఖియుల గూడి!

ఆ పర్వతాగ్రమం దా సరస్సులను
దామరల్ వికసించు దరుగని కాంతి !
సప్తర్షి గణము దా స్వయముగా ద్రుంచి
పూజకై గొందురు బోలుపు దామరల !
క్రిందుగా జరియించు జందురు నన్న !
మిగులు పుష్పంబుల మిలమిల జూచు !

ఊర్ధ్వ కాంతులచేత నోరజూపులను
వికసింప జేయుగా వేల దామరల !

ఆ హిమగిరియందు ననమానమైన
సోయగ తావులు విపులౌషధములు !
యజ్ఞాంగ యోనిత్వ యశము బరికించి
భూధరణంబును భూరిశక్తియును !
బ్రహ్మ దా నేరుగా సమ్మతి మెచ్చి
యజ్ఞ భాగముతోడ నెనలేని కృపను !
శైలాధిపత్యంబు జక్కగా నిచ్చి
పెద్దగా జేసెను జేర్మి హిమవంతు !

బంగారు కొండకు బరమ మిత్రుండు
మర్యాద నెఱిగిన మాననీయుండు !
హిమవంతు దక్షుడు నెనలేని ప్రేమ
పితృదేవతలకు బ్రియమైన పుత్రి !
మునులకు సైతంబు మోదమా బిడ్డ
ఆత్మానురూపయా నారి మేనకను !
వంశ గౌరవమును వర్ధిల్ల జేయ !
వేదోక్త పద్ధతి విధి బెండ్లియాడె !

కొంత కాలంబునకు గోర్కెలీడేర
నా పుణ్య దంపతు లా సతీ పతులు !
చక్కని దనమున సరస స్నేహాతకు
దాంపత్య విధులను ధర్మంబు నడుప !
నవయౌవనాంగియా నాతి మేనకకు
గర్భమాయెను చంద్ర కాంతులు వెలయ !

నాగకన్యల ప్రేమ రాగంబు లందు
వార్ధిలో సఖ్యము వర్ధిల్లు వాని !
కోపగించినగూడ కూర్మి దేవేంద్రు
కులిశంపు దెబ్బల గురికాని వాని !
మగువ భూధరపతి మైనాకు గనియె
మంద గాలులు వీచె మహి బుల్కరించె!

గత జన్మలో దక్షు గూతుగా బుట్టి !
భవునికి భార్యయై భాసిల్లి సతిగ !
తండ్రి నిందం జేత దల్లడమంది
వేగ యోగము చేత విడిచి దేహమును !
మఱల జన్మింపగా మహితాత్మ గౌరి
భూధరపతి నంత బొందుగా నందె !

ఉత్తమ సంతాన మొంద గోరుచును
భూధర సతిజేసె బుణ్య కార్యములు !
హిమవంతుడును గూడ నింపుగా సతికి
బాసటగా నుండె బరను కార్యముల !
వ్రతములు, నోములు నొప్పుగా జేసి
కళ్యాణి గౌరిని గనిరి బుత్రికగా !
నీతియుం దుత్సాహ రీతి వర్ధిల్ల
సంపదవలె బుట్టె సఖియ వారలకు !

ఆ మేనకాదేవి యా మహీధరుల
కా పార్వతీదేవి యవతరింపగను !
దిశలన్ని సౌందర్య తేజంబు వెలిగ
మంద గాలులు వీచె మహి బుల్కరించె!

శంఖధ్వనులు మ్రోగె శ్రవణపేయముగ
పూల వానలు గురిసె బుధమి సంతసమున !
స్థావర జంగము సకల జీవులును !
సంతతానందముల్ సౌఖ్యము లందె !

దూర పర్వత భూమి దుర్గంబు లందు
తొలి తొలు వేఘాలు దూగాడు చుండ !
ఉలుముల సవ్వడిప యుదయించి నట్టి
రత్న శిలాకృచే రాజిల్లునట్లు !
కాంతి మంశముచె గమనీయ మయిన
చిన్నారి పార్వతి వన్నెల జిందె !
తల్లి మేనకె బొందె దరగని కాంతి
పద్మంబు వికసించు బద్మాకరముగ!

పరమ కళ్యాణి యా పరమేశు రాణి !
పర్వతేశ్వరునకు బ్రభవ మొందగను !
అభిజను లందఱు నానంద మొంది
'పార్వతి' యని బిల్చి పరవశంబైరి !
"ఈ మహా దపమును నీ గాఢ దీక్ష !
ఓ బాల ! మానుము ! నోర్వ లేవనుచు !"
తల్లి బల్కుటఁ జేసి దరుణి యా దేవి !
'ఉమ' యనుచు పేరొందె నొప్పుగా ధరణి !
ఘన కార్యములు జేయ గలుగదా కీర్తి ?
ఘనులు జేతురు ఘన కార్యముల్ భువిని!

అందాల కళలతో నా చందమామ
ప్రతిదిన మభివృద్ధి భాసించు పగిది !

ఆ బాల పార్వతి యలరుచు గళల
పరివర్ధమానయై బరగచునుండె !
కమనీయ జ్యోత్స్నల గళలొప్పునట్లు
లలిత పార్వతి యందు లావణ్య మొప్పె !

ఆ హిమవంతున కా భూధరునకు
కొమరులు గోమరితల్ కొల్లగా నున్న !
పార్వతి యందుండు బంచ ప్రాణములు
అల్లారు ముద్దుగా నతి గారవించు !
మధువులు సొలికెడి మధు వసంతమున
ఎన్ని పూవుల తీగ లెన్నున్న దరులు !
తుమ్మెద బంతులకు దొరంపు ప్రేమ !
మావి కొమ్మలపైని మమత హెచ్చుగద !

ఆ శైల నాథుండు నా మహీధరుడు
పరమ కల్యాణి యా పార్వతిచేత !
దిశలు కాంతులు దొల్కు దీపంబు రీతి
గంగచే రాజిల్లు గగన మార్గముగ !
విద్యచే భాసిల్లు విద్వాంసు వోలె
పూత పవిత్రతల్ పొలుపుగా జేరె !

పార్వతీదేవి యా బాల్యంబునందు
నాటల రుచి జూచి యారుచున్నట్లు !
మందాకినీనదీ యందమౌ దరుల
నిసుక తిన్నెలయందు నిండ్లు నిర్మించు !
సఖులతో గూడి సరస రీతిగను
బొమ్మల పెండ్లిండ్లు నిమ్ముగా జేయు !

తోడిబాలికలతో నాడు బంతులను!
మాటిమాటికి నాడి మది బుల్కరించు!

పార్వతీదేవి యా బాల్యంబునందు
నుపదేశికుల యొద్ద నొప్పుగా జదివె!
కమనీయమగు శరత్కాలంబునందు!
నలరి గంగను జేరు హంసమాలగను!
దివ్యౌషధిని తన దీధితుల్ వెలిగి
రాత్రివేళను వచ్చి రాజిల్లినట్లు!
గతిజన్మ నేర్చిన ఘన విద్యలన్ని
యుపదేశ మాత్రము నొప్పుగా వచ్చె!

ఆ పార్వతీదేవి యత్యద్భుతముగ
పూమొగ్గ వికసించి పుష్పమైనట్లు!
శశిరేఖ పెరిగి చంద్రబింబముగ
సన్నని దేహంబు వన్నెలం జెందె!
ఆసవంబును గాని యుత్సాహ గుణము
మదనుని బాణమై మదికింపు గొలుపు!
బాల్యంబుకంటెను బహుమైన వయసు
నా బాలలో జేరె నలరు యౌవనము!

రంగుల కుంచెతో రమణీయమైన
చిత్రకారుడు దీర్చు చిత్రంబు భంగి!
రవికాంతి ప్రభచే రాజిల్లునట్టి
శతపత్ర సుందరి సౌభాగ్య గరిమ!
నవయౌవనము రాగ నగరాజ పుత్రి!
చతురస్ర శోభితయై చాన దీపించె!

ఆ జగదీశ్వరి యా లోకమాత !
తరుణ యౌవనమున దగ బ్రవేశింప !
ఆ పార్వతీదేవి యలరు పాదములు
భూమిపై నిడ నతి పొలుపుల జిందు !
ఒకచోట నిలువక యొప్పులగులుకు !
మెట్ట దామరపూల మెఱుపుల జూపు !
అంగుష్ఠ నఖములు నరుణగాంతులను
గ్రక్కునట్లుండును గమనీయ గతుల !

ప్రత్యుపదేశంబు బరగ గాంక్షించి
హంసలు నేరిపి యందాల నడక !
ఆ పార్వతీదేవి యందెల రవళి
ననుకరి పఁగ దను యాశయో యేమొ !
లీలా విచేష్టిత లలిత పాద గతి
హంసలు నేర్వనా యన్నట్టు లుండు !
లోక ప్రసిద్ధంబు 'విద్యయా విద్య'
ఒక విద్య నర్పి దా మొక విద్య గొనుట!

అపురూప సుందరి ! యఖిల కల్యాణి !
యా పార్వతీదేవి నజుడు సృష్టింప !
తన నేర్పునంతయు దగ వినియోగించి
ముందుగా జంఘల నందాలు గూర్చ !
పొంకపు కలుచలుగాక పొలుపుల నొలుకు
ఆదోకపలె నుండి యందాలు జిందు !
శేషాంగముల నెల్ల జేర్ప ముందుగను
అజుడు దా యత్నంబు సలిపెనట్లుండు !

నాగేంద్ర హస్తంబు నయగారములను
రాజ రంభాదుల రమణీయతను !
సజ్జన హృదయాలు సరసత మెఱయు !
సూర్యాలతో బోల్చి నగ్గింత్రు గవులు !
కవిచక్రవర్తి శ్రీ కాళిదాస కవి
అఖిల లోకేశ్వరి యా హైమవతిని !
సౌందర్య హృదయాన సరసతి బొగడి
యుపమాన రహితము సూర్యాలకనియో !

పరమ కల్యాణి యా పార్వతీదేవి
కాంచీగుణస్థాన కమనీయతను !
కీర్తింపదరమె యా కిన్నెరలకును
నందుకే గిరిసుత కా భాగ్య మబ్బె !
ఎన్ని పూజలు నోము లెన్ని జేసినను
నే పతి బొందని యీశ్వరు వంక !
మీ గిరి సుతబొందె యెట్టి భాగ్యంబొ !
దపసుచే బరమేశు దగ బతినొందె!

ఆ పార్వతీదేవి యుదరు మేఖంను
వర్ణింపదరమె యా వాచస్పతికిని !
పోకముడి నటుదాటి పొలుపుల జెందు
నాభి ప్రవేశించు నవరోమ రాజి !
మేఖలా మధ్యంబు మెఱుపుల జెంద
యా నీలమణికాంతి యందాల నొలుకు !

నవయావనము పోక నగరాజ పుత్రి
నవ్యసౌందర్యంబు నవశోభలందె !

యజ్ఞవేదిక వోలె విన్ననై యున్న
ఆ పార్వతీదేవి కలరె నెన్నడుము !
కటిదేశ మందున కమనీయ గతుల
వళిత్రయ మొప్పెను వయ్యారముగను !
నవయౌవనముజేయు నవసృష్టి యేమొ
కాము నాహ్వానింప గట్టిన మెట్లొ !

నవయౌవనముజేర నాతి పార్వతికి
అన్యోన్య పీడన మలరె స్తనద్వయము!
పాండుర వర్ణంబు బఱగి పెంపొంది
నల్లగల్వల కన్నె లమరె శోభలను !
వామాక్షి నింపొందు వక్షోరుహముల
దామరతూటి దారము బొందదాయె !

సుకుమారములునైన సుదతి బాహువులు
దిరిసెన బువ్వుల మురిపముల్ జిందు !
ఔరౌర ! మదనుడా ! యాశ్చర్య మొదవు
ముందుజూపున కెంతొ మోదంబు గలుగు!
ఓసి నే హరు జేత బూడిద నాదు!
నైన నే సాధింతు ! హరునంచు మదిని !
పంతాన గిరిసుత బాహువు లట్లు
హరు కంఠపాశమో యనగ జేసితివా!

స్తనములన్ రాజిల్లు దనరు కంఠమును
ముత్యాల హారము ముదమున గూడ!
అన్యోన్యాలంకార మతిశయంబుగను
గన్నుల బండువు గావించు చుండు!

హార మా కంఠము నందాల గూర్చు
కంఠమా హారమున్ గలిగించు శోభ।

కాంతి సుగంధముల్ కాంక్షించు లక్ష్మి
చంద్ర పద్మంబుల చందంబు గాంచి!
చంద్రునిలో జేరి యందంబు జూపి
పద్మ సుగంధంబు భాసింపదాయె!
పద్మములో జేరి పరికింప లక్ష్మి
చంద్ర జ్యోత్స్నల హాయి కాంచకోదాయె!
మరి పాప గిరికన్య ముఖ మాశ్రయించి
చంద్ర పద్మంబులు సుందరం బందె!

ఆ పార్వతీదేవి యధరోష్ఠ మందు
జిందేటి చిఱునవ్వు చిత్రింప వశమె?
చిగురు పై నుంచిన తెల్ల తామరను
నందాల పెట్టిరో చందమట్లుండు!
కెంపు పై ముత్యంబు నింపుగా నుంచ
సుందరం బెట్టిదో యందమట్లుండు!

పార్వతీ దేవి శ్రీ పరమ కళ్యాణి!
మధుర భాషణముల మధురిమల్ జిందు!
మంజుల స్వరమున మాటాడు నపుడు
తీపి దనంబునం దేనెల్లు దొలుకు!
అన్యపుష్టంబుల సరి రాగములు
విమల తంత్రుల వోలె వినిపించుచుండు!

కమ్మని గాలుల గదలాడు పట్టి
నల్ల గల్వాల బోలు నలినాక్షి గనులు!

చంచల మగుజూపు చాఱు నేత్రములు!
బోసినగవ నచ్చెరువు బొందు లోమదిని!
హరిణ కాంతల నుండి నందెనో యేమొ!
హరిణ కాంతలె నాకె సమకూరించినవో!
అనిపించు వీక్షింప నా బాల కనులు!
ఈ చూపు జక్కదన మొందైన గలదె?

సుదతి కనుబొమ్మలు జూడ జక్కనివి
కాటుక బంకను నీటుగా దిద్ది!
ప్రాణముగా బడెసేమొ వనిత భ్రూలతలు!
నాజూకుత శోభిల్లె యందాలు జిందు!
కాంతులు వీక్షించి కనలి మన్మథుడు
తనవింటి గర్వమ్ము డగ విసర్జించి
తన పూల బాణముల్ జనవింటి నుంచె!
కనిపించు గనుబొమ్మ లందాల జూడ!

ఆ పార్వతీదేవి యందాలు జిందు
కేశపాశము జూచి గినుక వహించు!
చమరీ మృగంబులు సరస వాలములు
వింజామరము లట్లు విసరుట మాని!
సిగ్గు లజ్జలు వున్న శీఘ్రమే యొసలు
వాల ప్రయత్నమున వెలయు గర్వంబు!

వేయు మాటలవేల వేయు గాథలును?
ఆ పార్వతీ దేవి యంద చందములు!
విశ్వ సౌందర్యంబు విపుల సుందరత
ఒక చోట జూడగా యోచించి ధాత!

సర్వోత్తమా ద్రవ్య సారముం గూర్చి
సృష్టించెనా యన చిత్రముం దోచు!
కాకున్న యాబాల కిమనీయ సృష్టి
రూపు వహించునా యూహ నీ జగతి?

సకల లోకంబుల సంచరించుచును
నొకనాడు నారదుం డొప్పుగా వచ్చి!
హిమవంతు దీవించి యింపుగం గులుకు
పార్వతి గని మాని పరగ నిట్లనియె!
ఈ బాల పొందగల దీశుని బతిగ!
హరుని శరీరార్ధ మందు తేగాక!
సవతులు లేనట్టి సఖియ యా జగతి
సర్వేశ్వరుని బొందు సార్థకంబుగను!

అంతకే గిరినాథు డాత్మ సంతృప్తి
పూర్ణ యావనవతి పుత్రికై తాను!
అన్యుని వెదుకంగ నాసక్తి మాని
నిశ్చింత నుండెను నిర్మల బుద్ధి!
మంత్ర పూతంబైన మహిత హావ్యంబు
అగ్నిని బొందగా నర్హమా గాని
ఇతర తేజస్సుల నింపుగా బొంద
నర్హమా వస్తువా? యాహుతి నొంద!

ఆ హిమవంతుడు నా మహీధరుడు
నడుగని బరమేశు నర్చించి వేగ!
తన కూతు పార్వతి దగ స్వీకరింప
జేయు జాలకపోయె జిరసత్యమేగ!

అభ్యర్థనా భంగ మగునేమొ యనుచు
నిష్టకార్యము గూడ నిది మనం దలచి!
మాధ్యస్థ రూపంబు మౌనభావమున
మాటాడ కుందురు మహితాత్ము లెపుడు!

సుకుమారి సుందరి సుదతి యాగిరిజ
గత జన్మలో తన సతిగ జెల్వొంది!
దక్షుని రోషాన దసరి యోగాగ్ని
దేహంబు విడిచెనో దివ్య మార్గమున
ఆనాటి నుండియు నా మహాశివుడు
ముక్త సంగుండాయె ముని వృత్తినుండె!
అపరిగ్రహుండుగా నా మహామహుడు
ఆత్మ చింతనమున నలరె యోగమున!

ఆ కృత్తివాసుండు నా త్రిలోచనుడు
నియతాత్మ చిత్తుడై నిర్మలబుద్ధి!
గంగా ప్రవాహంబు గదలాడు చోట
దేవదారుల తోడ దీపించు స్థలిని!
కస్తూరి వాసనల్ గప్పెడి తావు
కిన్నెర గానముల్ జెన్నుగా జెలగు
ఉన్నత హిమగిరి నొకరమ్య చరియ
దపము జేయగ బూనె దన్మయత్వమున!

ఆ పరమేశ్వరుం డటు దపము సేయ
సురపొన్న బూవుల శిరమున దాల్చి!
భుజగ కృత్తి వస్త్రముల్ పొందుగా గట్టి
మణి శిల బూతల మసలు ప్రమథులును!

సఖులతో గూడిన సరసాబ్జ ముఖిని
తన తనూజాతను దగ నియోగించె!

ఆ పరమేశ్వరుం డా పరంజ్యోతి
యోగిరీ కన్యక నా కల్వ గంటి!
తన యోగ దపముల దగు విఘ్నమైన
తరుణి సేవలకును దగ సమ్మతించె!
మనసు నంచంతకు మార్గంబు లున్న
మనసు నిరోధించి మహిమాన్వితముగ!
నిలుచు వాడే గదా! నిజమైన ధీరు
డనిపించు కొనగదా నివనిపై సతతము!

ఆ త్రిలోచనునకు నా శైల తనయ!
పూజకై కుసుమాలు బొందుగా దెచ్చు!
నివసించు వేదిక నూడ్చు నీరముల్ దెచ్చు!
దర్భలు, పత్రముల్ దగ దెచ్చి యిచ్చు!
ప్రతిదిన మీ రీతి బరగ శుశ్రూష
బరమేశునకు జేయు పార్వతీదేవి!
ఆ పరమేశునకు నా రీతి జేసి
శుశ్రూష నేసిన పడతి పార్వతి!
సన్నని కిరణాల వెన్నెలల్ బఱపి
బాలచంద్రుడు వీమ బడలికల్ దీర!

ప్రథమాశ్వాసము సమాప్తము

# శ్రీ గిరిజా కళ్యాణము

## (ద్వితీయాశ్వాసము)

### (తారకాసురుని క్రూరకృత్యములు, దేవతల బాధలు)

ఆ పరమేశున కా శైల తనయ
శుశ్రూష జేసెడి శుభసమ యమున!
తారకుం డను నొక దానవేశ్వరుడు
నజుని వరంబున నఖిల లోకముల!
బాధింప దొడగెను బలు విధంబులను
దేవత లందఱు దిక్కేది యనుచు!
ఇంద్రుని తోడుత నెల్ల దేవతలు
బ్రహ్మలోకము జని ప్రార్థించి రపుడు!

సుప్త పద్మంబుల శోభిల్లు రాత్రి
భాను దర్శనమున ప్రభవిల్లు నటుల!
దీప్తుల దగ్గిన దివిజుల కపుడు
ధాత ప్రత్యక్షమున దగ ధన్యులైరి!

సర్వ లోకములకు సకల విద్యలకు
దా సృష్టి కర్తయు దా గురుండైన!
నాల్గు మోములుగల నలువకు మ్రొక్కి
భక్తితో ప్రార్థన బలికి రా సురలు!

సృష్ట్యాది నొకండవై చోద్యమై యుండి
సత్త్వాది గుణముల సరసత గూర్చి!
మూర్తి త్రయంబును మోదము నంది
యలరు స్వామివి నీవు! యంజలి గొనుము!

నీళ్ళలో నుంచిన నీ బీజ మహిమను
సకల చరాచర సంఘంబు వొడమె!
నిఖిల విశ్వంబున కీవె కారణము
నీ చిత్ర రచనకు నీరాజనములు!

సృష్టికి పూర్వము నొక్కడవై యుండి
మూడవస్థల నంది మూడు మూర్తులను!
సృష్టి సంహారంబు స్థితికి హేతువుగ
నేరు నీ కీవె గాను! నభివందనములు!

స్త్రీ పురుష రూపముల్ చిత్రింప దలచి
ఆత్మరూపము రెండు మూర్తులం జేయ!
ఆమూర్తులే గదా యఖిల సృష్టికిని
తల్లిదండ్రు లటంచు దగ జెప్ప బడియె!
నీదు కాల విభాగ నియమము నందు
నీ రాత్రి బవళులు నిఖిల జీవులకు!
ప్రళయోదయంబులు ప్రకృతి కంతటికి
సంహార సృష్టులై సరసత బరగు!
ఈ విశ్వ సృష్టికి యీవె కారణము!
నీవె లయకర్తవు నీ వాదిమూర్తి!
జగదీశుడవు నీవె జాగృతి వీవె!
నీవు లేనిది లేదు నిఖిలంబు నీవె!

నీ చేతనే నీవు నిను దెలిసి కొనుచు
నిన్ను నీవే సృష్టి నిర్మించు కొనుచు!
నీవు లయ మొందువు నీలోనె నీవు!
నీవు స్వతంత్రుడవు! నీ వధికారి!

ద్రవ కఠినము లీవె! నీవె సర్వంబు
స్థూల సూక్ష్మము లీవె! సురుచిరం బీవ!
లఘు గురువులు నీవె! లావణ్య మీవె!
కార్యకారణ మీవె! కల్యాణ మీవె!
అణిమాదులును నీవె! యంబర మీవె!
నీవు లేనిది లేదు నిఖిలంబు నీవె!

హెచ్చు తగ్గు స్వరంబు లింపొందు మొదలు
ఓంకార శబ్దంబు యొనరు వాక్యములు!
కర్మయజ్ఞం బౌచు గ్రాలుచునుండు!
ఫలము స్వర్గంబునై బాసిల్లుచుండు,
అట్టి వేదములకు నధిపతి వీవు!
నీవు లేనిది లేదు నిఖిలంబు నీవె!

సత్త్వ రజస్తమో సంఘమౌ బురుషు
భోగ మోక్షము లిచ్చు మూల ప్రకృతివి!
నీవ యుందురు మఱి నిఖిల లోకములు
గాంచుచుండెడి యాత్మగా నెంచుచుంద్రు!
పితృ దేవతలకు పితరుండ వీవు!
దేవతలకు మఱి దేవుండ వీవు!
పరమున కంటెను బరమైన వాడ!
బ్రహ్మల సృజియించు బరమాత్మ వీవు!

శాశ్వతుండవు నీవు సర్వంబు నీవు
హవ్యంబు! హోతవు! వంటయును నీవు!
భోజ్యవస్తువు నీవె! భువి యంత నీవె!
వేద్య వేదితముల విశదమౌ వాడ!

ధ్యానించు వాడవు! ధ్యానింప దగిన
దంతయు నీవె సూ! సకలంబు నీవె!

ఆదేవతాసంఘ మతి భక్తి తోడ
ప్రార్థన సేయంగ ప్రణతుల వినియు!
అత్యనుగ్రహమున నా సృష్టికర్త
యా దివౌకసులకు నాసక్తి పలికె!

ఆర్ద్రత తోడుత నాహ్లాదముగను
నా చతుర్ముఖుడట్లు నలరి బల్కగను!
నాల్గు రీతుల భాష నాల్గు మోముల ను
వెలువడి నటులుండె వేడుక మీర!

ఓ దివౌకసులార! ఓ బిడ్డలార!
ఆజానుబాహువు లమరవరు లార!
వీర విక్రము లార! విదిత తేజమున
సామర్థ్యమున మీరు సాధించినట్టి!
అధికారములచేత నలరారు మీకు
స్వాగతం బిదె! మీకు! స్వాగతం! బిదిగో!

ఓ దివౌకసులార! ఓ బిడ్డలార!
మంచుతో గప్పిన మహనీయమైన
నక్షత్రముల బోలి నగుపించు చుంటి
రేమి కారణ మానొ? నేమాయె నేమొ!
తొల్లింటి దేజంబు జూపరా దేమి?
కమనీయమైన యా కాంతు లెటు వోయె?

కాంతుల జిందెడి కమనీయ మైన
ఇంద్రుని యాయుధం బేల నిట్లయ్యె?

వధియించి వృత్రుని వాసి కెక్కినది
వజ్రాయుధంబునకు వన్నెలు తగ్గె!
మొక్కపోయిన యట్లు మొనపోయినట్లు
కానిపించుట గల కారణం బేమి?

వరుణుడు నటులుండె వన్నెలు తగ్గి
మోము నేలకు వ్రాలె మోహంబు పోయె!
అరులకు దుర్వారమైన యా పాశ
మతి కాంతిహీనమై యుండుట జూడ!
గరుడమంత్రంబుచే గతి కోలుపోయి
ఫణిదైన్య దీనత కనిపించు చుండె!

ఆ కుబేరుండటు నలతను గుంది
కాంతి దప్పుట గల కారణం బేమి?
భగ్న శాఖ ద్రుమము బగిదిని మున్న
యురుగద నొదిలిన యుత్తరాధిపుని!
బాహువున్ జూడగా బాధలు మదిని
తెలుపు చున్నది పోలె దేలపడు చుండె!

యమలోకమును నేలు యమధర్మరాజు
కాంతులం దగ్గిన కాల దండమును!
సోలి గీలుట జూడ నిర్వాణమైన
కొలని దీనత్వంబు కొమరొప్ప జూపె!

ద్వాదశాదిత్యుల దశలు మారెనొకొ?
ఈ చల్ల దనమేమి? యీ విధం బేమి?
ఆ తేజ మాదీప్తి యా యగ్ని శిఖలు
నే మాయెనో గదా! యెందు దాగినవో!

చిత్తర్వులోనున్న చిత్రంబు బగిది
చూడగా దగియుండె! జోద్య మాయెనుగా!

ఈ మరుత్తు లిదేమి? యీ తడబాటు?
గమన వేగము దగ్గి గతిని దప్పినవి!
పెనుబండ డీకొని వెనకకు మఱలు
సెలయేటి ధారల జిత్ర మాయెనుగా?

రుద్రగణంబేమి రౌద్రమున్ వీడి
జటముడి వ్రేలాడు జంద్రరేఖలను!
హుంకారములు వీడి శంకల మదిని!
నీ గతి నుండుట కేమి కారణమొ?

సామాన్య విధి నొక సవిశేషవిధిని
సంకోచ మొందిన సరళిని మీరు!
లబ్ధప్రతిష్ఠులు లావైన వారు
అట్టి వారలు శత్రు లాక్రమింపగను!
ఇట్టి పరాభవం బొందిరా యేమి?
ఇట్టి వెన్నాటున గందిరా యేమి?

కొమరులారా! మీరు కోరున దేమి?
కూడివచ్చిన పని కోరిక యేమి?
లోక సృష్టియు మఱి లోక రక్షణము
నాయందు మీయందు నయముగా గందు!

అంతట వాసవుండా బృహస్పతిని
వివరింప ధాతకు వేడుక మీర!
కనుసైగ జేసెను గలత బాటునను!
కమలాకరంబుగా గనులు వేయుంట!

కన్నులు వేయింటి కన్నను మిన్న
సర్వ కార్యములందు సరసత నెపుడు!
ఆలోచనలు దెల్పు నాచార్యవరుడు!
వాసవు గనుసైగ వాచస్పతియును
ప్రాంజలి నిట్లనె బ్రహ్మతోడుతను!
వివరింప దొడగెను వేదనను సురల!

నీవు చెప్పినదంత నిక్కమే తండ్రి!
మాయధికారముల్ మూడు తేజములు!
అరివీర బలమును హరియింప బడిరొ
సర్వ సృష్టి స్థితి సంహారకుడవు!
సకలము దెలియును సాధు సంరక్ష!
వినను దెలిపెద వినుమయ్య కృపను!

నీ వరములచేత నిండు గర్వమున
తారకాసురుడను దానవు డిపుడు!
లోకనాశమునకు గాక జేయుచును
తోకజుక్కకు బోలె దూలుచు నుండె!

తారకు భయముచే దల్లడిల్లుచును
భానుండు దీప్తుల భాసింప మానె!
తారకు బురమందు దా భయంబడుచు
బావుల కొలకుల బహు సరస్సులను
కమలముల్ వికసింప గాంతులు దగునో!
అంత మాత్రము సూర్యు డందించుచుండె!

సేవించు చంద్రుండు జిరహాస్య స్థితిని
సర్వకాలము తన కళలతో గూడి!

హరు జటాజూటమం దా శేఖ దక్క
అన్నింట బచరించు నా దైత్య వరుని!

పూ దొంగ యుంచుచు బూదోటలను
వాయు దేవుని బిల్చి వరుస దారకుడు!
తన బ్రక్కనే నిల్చి తగ వీవనలను
వీచున ట్లీవగా వివరించి నిలిపె!

పర్యాయమున వచ్చి బద్ధతిన్ మాని
వస్యాకరములు మాని సయ్యాట మాని!
ఋతువు లిన్నియు దాము నొక్కపై వచ్చి
పుష్ప సంభారంబు బూజకు సేయు!
ఉద్యాన పాలుర నొప్పగా గూడి
సేవించు చున్నవి చేరి రక్కసుని!

ఆ పరిశాంపతి యా తారకునికి
రత్నాలు ముత్యాలు రంజిల్ల నొసగి!
దయను సంపాదింప దా జూచు చుండు
వెదుకు మందును నీవు వెతనంది మదిని!

మాణిక్య దీపముల్ మాన్యత నొంది
వాసుకి మున్నగు నెపగు సర్పములు!
శిర రాత్రి దీపముల్ శిరుల బొంది
సేవించు చున్నవి చిరదాస్య వృత్తి!

ఆ తారకుని దండ పండగా గోరి
కల్పవృక్షం బట గనకే భూషలను!
మణులను, ముత్యాలు, మాణిక్యములను,
పట్టు వస్త్రములను భవ్య వస్తు తతి!

మాతలతో సంపి ప్రీతిపాత్రతను
అడుగుల మడుగులు నర్పించు చుండె!

ఈ విధంబున బూజ లిట్టి మర్యాద
లందుచు నిలవడు పర నిముసమును!
భువనత్రయంబును బూనిక తోడ
బాధించు చున్నాడు బలుడు రక్కసుడు!

నందన వన తరు లందముల్ మాసె
మోడులై బీడులై మొఱయుచునుండె!
ఆకాశగంగ నీ రంది పుచ్చుకొని
యమర వధూ సదయా హస్తాలచేత!
చిదిమెడి తీగలు జిన్నారి తరులు
ఛేద పాతములను ఖేద మొందినవి!

ఆ తారకుడు నిద్ర యఱిన యప్పుడు
చెఱనున్న దేవతా చేటులు వగను!
ఘర్మ శీకరముల బ్రభవింప జేసి
సన్నని గాలుల జల్లులన్ తడిపి!
విసురుచు నుందురు వింజామరలను
గుములుచుందురు మది కుహరము లందు!

ఆ తారకుడు భువి నపురూపమైన
సూర్యాశ్వముల గాథ గొరియలచేత!
చూర్ణములైనట్టి సురుచిరం బయిన
మేలు పర్వత శిఖర మొఱవుల దెచ్చి!
క్రీడల కనువుగా గ్రీడింప దలచి
తన నివాసములను దగ నిల్పికొనియె!

వీర్యవంతములైన వివిధౌషధములు
సన్నిపాతంబును జక్కజేయునోకో!

అంతియే కాదు మా కలరె సమ్మోహము
హరిచక్రమందున యాశలు గలవు!
కాని యా చక్రంబు గరిత రక్కసుని
కంఠహారం బాయె గాదె! చిత్రంబు!

ఐరావతాదుల యాప గట్టించి
తారకు సేనగలు వీరత్వమునను!
పుష్కరావర్తక పోలుపు పదముల
నప్రక్రీడలయందు నగ్గిలుచుండె!

కావున హే ప్రభూ! కర్మబంధముల
విడివడు వాడెల్ల విమల జ్ఞానమును!
కోరునో మాదొక కోరిక స్వామి!
మా కార్యమున్నించి మమ్ము రక్షింపు!
ఆ తారకాసురు హత మొనర్పుటకు
సేనాని నొకనిని సృజియింపుమయ్య!

సుర రక్షకుండయి శోభిల్లు వీరు
డుదయింప నిర్గాంచు ముదముతో వాని
సేనాధిపతిజేసి చేకొని పోయి
శత్రుల దెటాక్కి శౌర్యంబుతోడ!
జయలక్ష్మి గొనిదెచ్చు జయజయ ధ్వనుల!
సృజియింపు నొకనిని సేనాని నిపుడు!
దేవగురు డిట్లు దేబదెల్లముగా
పలుకగా నా బ్రహ్మ పలుకు లిట్లుండె!

తనువుల కావల దనరిమై యున్న
యా పరంజ్యోతికి నంత సాధ్యంబు!
విష్ణువు జేసెను వెలయ నా జేత
నతిశయ మహిమను నందగా నతడు!
పొందజాలని పూర్ణ పురుషుండు పతిని
కలవి కానిది లేదు నంత సాధ్యంబు!

కార్య కుశలురు మీరు గల్యాణ గుణులు
సంయమ స్థితినున్న శంభుని మనసు!
శుశ్రూష జేసెడి సుకుమారి గిరిజ
సౌందర్య గుణముచే సాహిత్య మొంద!
తగ నయస్కాంతముం దగులు లోహముగ!
ఆకృష్టు యత్నము నలరుడ వేగ!

బ్రహ్మ రుద్రులమైన బరమమైనట్టి
మా బీజములు దాల్ప మహితు లీ బుధమి!
ఇరువురు మాత్రమే నింపుగా గలరు
శంభు తేజము దాల్ప శక్యమా యుమకు
ఇతరులు జాలరు నీ సృష్టియందు!
నా తేజమును దాల్ప నయముగా శివుని!
అష్టమూర్తుల యందు నలరెడినట్టి
జలములు మాత్రమే సామర్థ్య మగును!

ఆ యీశ్వరుని పుత్రు డంతట మీకు
సేనాధిపత్యము జెన్నుగా దాల్చి
శౌర్య విక్రమముల శత్రువుల జీల్చి
ఉవిద కాంతుల జెఱ దీర్చి గాపాడ!

విబుధుల కిటు దెల్పి విశ్వవిధాత!
యంతర్హితుండయ్యె! నాశీర్వదించి!
మనసులో గర్తవ్య మహిమను నూహించి
దివిలోకవాసులు దివికేగి రపుడు!

హరుని స్వాధీనంబు నందు కార్యమున
మారుని సాహాయ్యము ప్రార్థింప దలచి!
పుష్పధన్వుని మది బోలుపుగా దలచె
పాకశాసను డంత బహు వేగముగను!

ఆ దేవతానాథు డలరి వేవేగ
మనసులో మర్మముగ మన్మథుం దలప!
రతి పద వలయముల్ రాజిల్లునట్టి
లలిత సుందరులైన లావణ్యవతుల!
సుందర భ్రూలత లందాల కొనలు
గల చాపమును దన కంఠమున దాల్చి!
మావి చివురాస్త్రముల్ మధునకు నిచ్చి!
ప్రాంజలి తోడుత ప్రభు శతమఖుని
బుష్పధన్వుడు జేరె పూలవానలను!

[ద్వితీయాశ్వాసము సమాప్తము]

# శ్రీ గిరిజా కళ్యాణము

## తృతీయాశ్వాసము

### (శివుని కంటి మంటచే మదనుడు భస్మమగుట)

పుష్పధన్వుడు రాగ బుల్కరించుచును
నా నాహేంద్రుడుం డంత నాదరంబునను!
ఎందఱో దేవత లుండగ నొదిలి
మదనుని గాంచెను మాధుర్య మొలుక!
ప్రభువుల హృదయముల్ పాదరసములుగ
కలుగా జంచెల మాశ్రితాళింపు!
కార్య ప్రయోజన కరణిని బట్టి
గౌరవ తిరస్కార గతి గల్గుచుండు!

అంతనా నాకవుం డతి మన్ననలను
తనదాపు కూర్చుండ దగు నాసనంబు!
చూపగా మదనుండు జూరలు గొనుచు
'నిది ప్రసాదం'బంచు నిటు పల్కసాగె!

ఓ దివిజాధిపా! యో మహాపురుష!
సెలవిమ్ము నేదైన జేసెద క్షణము!
ఈ లోకముల యందు నేమి జేయగను
నాజ్ఞచే నను జేయు! మారి ధన్యాత్మ!

ఇంద్రత్వమును గోరి యెవడైన గాని
దీర్ఘమౌ తపముల దేజస్సు కలుగ!
నీ సాయగనుండి నిలిచెనా యేమి
పలుకుము నా పూలబాణముల్ వేసి!

నిను దిరస్కృతిజేత నీరస బఱంచు
కోపన యెన్నో మార్లు జేరొక్కనుమా!
ఆ సుదతి నా పూల యమ్ముల గురిని
చిగురు సెజ్జలకు నే జేర్తు వేగ!
ఓవీర! ఓ ధీర! ఓ సురనాథ!
విశ్రాంతి గొనవిమ్ము! వీర స్వభుజమున!
ఆలరి ఒన్ దయచేత నాశీర్వదింపు
నీ పగవాని నే నీరస బఱతు!
దైత్య నాసఖ్యులలో దాగియుండినను
భయపడునట్లుగా బాధింతు వాని!
నీకు మాత్రము గాదు నీరజ ముఖుల
స్ఫురితాధరములకుం సుడివడ జేతు!

కుసుమాస్త్రితుడ నైన గొప్పదిని నైన
నీ యనుగ్రహమున నిఖిలంబు గెలుతు!
ఒక్క వాసంతుని యొప్పు సాయమున
నలరి పినాకిని హస్తాన దాల్చు!
హరునైన యెదిరింతు నబ్బము గాదు!
నితరులు లెక్కయా? యే ధనుర్ధరులు!

హరు నిబ్బరమునైన యారి గెల్తునని
బలికెడి మదనుని గారవశ్యమున!
మనసున గోరిక మతి మూర్తి గట్టి
అవతరించిన యట్లు నా సురేంద్రుండు!
మది బుల్కరించుచు మధుర భావనను
పుష్ప ధన్వునితోడ బొలుపుగా ననియె

నీవు బల్కిన దంత నిక్కంబు నిజము!
నాకు రెండస్త్రములే నయముగా వినుము!
ఒకటి వజ్రాయుధ మొకటి నీవు
ఈ యాయుధములచే నే నిల్చి యుంటి!
తాపసు లెందరో తత్త్వవేత్తలను
నీ మహా యాయుధ మొందును గాదు!
నీవున్న నో! సఖా! నిఖిలము నాదు!
సర్వతోముఖమైన సాధన మీవు!

నీ సత్త్వ మెఱుగుదు నీ మహా బలము
నా నెయ్యుండవు గాన నయముగా నీపై!
గురుభార మొంచెద గూర్మి సేయగను
భూభార నాశక భూరి కార్యమును!
జూచియో గాదటే! సురుచిరంబైన
శేషుని బాన్పుగా జేకొనె హరియు!

ఓ సఖా! మన్మథ! యిప్పుడె బల్కితివి!
వారు నిబ్బరమునైన యెడదలు నంటితివిగ!
దేవ కార్యము నీవు దీర్పగా నిప్పుడె
పూనికొన్నట్లయ్యె బొంకుపుగా నీవు.
దైత్యుల బాధలు దపియించుచున్న
దివిజుల గోర్కెను దీర్పు! నా వినతి!

దైత్యుల గెలువంగ ధర్మంబు నిలుప
శివతేజ ముత్పన్న సేనాధిపతిని!
గోరుచు నున్నారు గూర్మి దేవతలు
ఆ మహాశివు డిప్పు డాత్మ సంయమము

హారునిపై పూవుల బాణములం [illegible]
వెడలుచు నుంటివి విమలాస్త్రములను
నీదె భాగ్యముగదా నీదె ధన్యత్వ!
అనితర సాధ్యమా యున్నదె దీక్ష!
సాధారణంబైన సహజ కార్యములు
బుడమిని కర్త్రి బొందుదురు నాడ
ఘన కార్యములు జేయ గలుగదా కీర్తి?
ఘనులు జేతురు ఘన కార్యముల్ భువిని!

వేడుచుండెడి వారు వినుము! దేవతలు
ముల్లోకములును మోదమా కర్మ!
నీ బాణ మహిమనో నిండు సాత్త్వికము!
నీ కార్యక్రమ మన్న నీకదే సాటి!

ఈ వసంతుడు నీకు నెప్టుడూ సఖుడు
నీకు సహాయుడై నీతోడ నుండు!
అగ్నికి దోడుగా నా సమీరణుని
ప్రేరణ జేయుచు శోధించి బంపు నారి?
దివిజుల కార్యంబు దీక్షగా జేసి
మన్నన నేయుము మహి నాదు మాట

అని పల్కె నింద్రుండు నా మన్మథుండు
'నటులనే' యన వల్కె నతి వినయమున!
దేవ కార్యము జేయ-దివిజులు మెచ్చ
ప్రభునాజ్ఞ గైకొని బంటులు దేరంగ!
ఐరావతము జరచు హస్తంబు తోడ
సుర రాజు దీపించె సుందరంబుగను!

అంత నా మదనుడా సతి సోయగమున
ప్రభు దీవెనల నంది ప్రభలు జిందుచును!
సఖుడు వసంతుండు సతి రతీదేవి
శంకతో వెంటను జనుదేర గాను!
ప్రాణంబు వోయిన ప్రభు కార్యసిద్ధి
జేయు సాహసముతో జెలు వగప్రనను!
హిమ పర్వతంబున నింపుగా నున్న
స్థాణ్వాశ్రమమునకు జయ్యన వచ్చె!
ఆ శివాశ్రమమున యుబ్బి వసంతుండు
తపసుల దపముం దగ ప్రతికూల
మైన తన నిజరూపు నలరంగ దిశలు!
మదనుని కార్యంబు మదియందు దలచి
చివురుల బూవుల జెన్నారుచుండ
గొండంత వ్యాపించె గోటి యందాల!

వాసంతు డావిధి వన్నెలజింద
వాసంత ఋతువును నలువుల జిందె.
ఉత్తరాయణమును నుదయంబు నందె
దక్షిణ పవనముల్ దరికొని వీచె!
చిగురుల పూవుల చిత్రముల్ వెలసె
తీగెలు పొదలను దీర్చె సొంపులను!

ఆ వసంతుని సృష్టి యతి విచిత్రంబు
నవ చూత బాణంబు లావణ్యముగను!
పల్లవాంకురములు పత్రముల్ గాగ
తుమ్మెద పంక్తులన్ దొలకంగ జేసి!

మదను నా మాక్షరాల్ మర్మముగ జెక్కె
ననిపించు జిత్రమును నందాలు జింద!

ఆ యశోకము జూచె యారి శోభలను
నవ పల్లవములను నవ పుష్పములను!
పారాణి యందెల బాద తాడనము
దోహదమే లేక దోలుకాడుచుండె!
నవ వసంతము రాగ నవరాగ రుచుల
నా యశోకము జూచె యతి సువాసనల!

వాసంత ఋతువున వన్నెలం జిందు!
కర్ణికారము జూచె గనుపియ ముగను!
వన్నెలా యధికము! వాసన జిన్న!
మనసున ఖేదంబు మసలుచు నుండు!
ధాత్రి సృజనమున దగ నెందు జూడ
నెద్ది యో లోపంబు నద్ది నట్లుండు!
అవికాస భావము నతి యొప్పినైన
చంద్రవంకల శోభ జిందుచు నుండు!
మోదుగ పుష్పాల మురిపాల జూడ!
మనసున మంజుల భావముల్ వెలయు!
ఆ వసంతుని తోడ నా వనస్థలులు!
నఖక్షత లందిన నవ్యతల్ దోచు!

తుమ్మెదల్ రాగాలు దూలి పాడగను!
తిలక పుష్పము జూచె దీయగా లతలు!
బాల సూర్యుని భంగి బ్రభలు జిందుచును!
లత్తుక రాగాల లావణ్య మొప్పె!

మకరికా పత్రముల్ మధురిమల్ నిండ!
స్వేదోద్గమము జేత జెంగెను గొంత!

ఆ స్థానవనమున యలరి యున్నట్టి
శాంతముల్ ఋషులును దగ సమాగమములు !
ఈ యుకాంతము నందు నీ వసంతము
మనసున బుట్టించు మధుర భావములు !
యున్న బూర్ణముగా నలు నిరోధించి
స్థిరముగా నుండెరి ధీర చిత్తములు !

ఆ పుష్పధన్వుండు నా రతిం గూడి !
పూర్ణ భావానువృత్తి బొల్పార రాగ !
స్థావర జంగమ సకల మిథునంబు
ప్రేమ రసమున దూలె ప్రీతి యుప్పొంగ!
శృంగార భావముల్ రంజుగా నవుడు
క్రియతో ప్రకటించె క్రీడల గూడి !

పూతేనియ తోడి బొలుపుగా నున్న
మందార పుష్పమును మధుర పాత్రమున !
తుమ్మెద ప్రియురాలు నెమ్మదిం ద్రావ
యుపచారం చేసె ప్రియ నానందముగను !
శాకుం వనమునే దమ్మయ మంది
యుర మోదమ్ము గన్నుల నాదరాను ష్వాగిని
కృష్ణసారం బంత శృంగార మొప్ప
శృంగముతో గీరె నంగ రాగమున !

కొలనిలో నున్న యా కూర్మి కరేణు
బంకజ రేణువుల వాసనల్ జిందు !

గండూష జలముల గడమున కిచ్చె
వలపు జూపులు జూచి వన్నెలం జిందె !
చక్ర వాకంబును సగ మాహరించి
తామర తూటిని సఖియ కందించె !
అనురాగముల చేత నా ప్రియురాలి
జక్కిలి గింతల దన్మయము జేసె !

శ్రమవారి బిందువుల్ సఖి మోము పైని
మకరికా పత్రాల మాధురిం జెలుప !
పుష్పాసవంబుల బొలుపులు జిందు
ఆఘూర్ణితంబులౌ యలరు నేత్రముల!
కిన్నెరి మీటుచు గీతము బాడ
సఖియ మోమును జూచి సరసత జిలుక !
ఆపలేకను ప్రేమ యలరి కిన్నరుడు
చుంబనం బొనరించె జాలిం గొనుచు !

పూగుత్తు లనియెడి పొలుపు బాలిండ్ల
చివురులను బెదవుల జెన్నొందు కాంతి !
వనలతాంగన లవుడు వలపుల జింది
వంగిన గొమ్మల వ్రాలెను ప్రీతి !
వృక్ష నాయకులును విచ్చిన ప్రేమ
కొమ్మ లనియెడి దీర్ఘ కూర్మి బాహువుల !
కౌగిలింతల నంద కాంతల గూడి
యుయ్యాల లూగెను వయ్యారముగను !

ఆ వసంతము నందు నా మహేశ్వరుడు
అప్సర గీతము లాట పాటలను !

ఆత్మానుసంధాన మాసక్తి మునిగి
వినిపించు కొనడాయె వేసుక బడను!
ఆత్మానుసంధాన యోగీశ్వరులకు
స్వాధీన చిత్తులౌ సాధు పురుషులకు!
అంతరాయము గల్గి సగచాల్లు బడరు
నియమ నిగ్రహముల నీతి గోల్వరు!

ఆ శివాశ్రమ మందు నా లతా గృహము
ద్వార ముందున నిల్చి యరసి ప్రమథులను!
బంగారు బెత్తము బట్టి నొక చేత
కుడిచేత తర్జని గొమరొప్ప నెత్తి!
చాంచల్యమును వీడి చపలత మాని
శాంతి వహింపంగ సైగను జేసె!

ఆ నందికేశ్వరుడు నటుల శాసింప
ప్రమథులే కాదు నవ ప్రాణి కోటియును!
కదలదు వృక్షంబు గలికి తుమ్మెదయు
ముని సంఘ మంతయు మునిగెను శాంతి!
కోకిల బలుకదు కులుకదు నెమ్మి
ఖగసమూహం బంత కలకిల మానె!
చిత్రకారుడు వ్రాయు చిత్రంబు బగిది
ఆ వనం బంతయు నటు మారిపోయె!

శుక్ర గ్రహంబును సూటిగా బోయి
పయనం బొనర్పంగ భయపడు రీతి!
ఆ నందికేశ్వరు నటు వేగ దొలగి
ప్రక్క ప్రక్కల నున్న ఫలపుష్ప తరుల!

పుష్ప ధన్వుడు దాటి బోలు పొంద జూచె
ధ్యానాస్పదుండైన తగ భూత పతిని !

అటు దేవ దారువు నలరు వేదిను
బఱచిన శార్దూల చర్మంబు మీద !
సంయమ స్థితిలో దగిమున్గి దేలు
యోగీశుండై యున్న యీ కృత్తివాసు !
ఆనంద మూర్తి యా పరంజ్యోతి
ఈశ్వరు ! పరమేశు ! జగదీశు ! శివుని !
చావు దగ్గఱకొచ్చి తగ పట్టువిగు
మదనుడు బోషిగాంచె మహనీయ జ్యోతి !

వీరాసనమునందు విమల భావమున
కరముల దోషలపై గ్రమ్మిన దాప్ప !
ఆశివు గరములు సలు సొంపు లూని
దామర పూవులు దగ బూచినట్లు !
ఆ పరమేశ్వరు ! నా సదాశివుని
పంచ బాణుండంత గాంచె గన్నులను !

కాల సర్పంబుతో గట్టబడిన
హార జటా జూటంబు నలరె కాంతులను !
అక్షసూత్రము జెవి నలరారుచుండి
వింత తేజసున వెదజల్లు చుండె !
నీల కంఠము లోని నిగ్గులను దోణుకు
లేడి చర్మము దాల్చి లీల యోగమున !
అలరెడి బరమేశు నా సదాశివుని
బంచ బాణుం డంత గాంచె కన్నులను!

కాంతి నైశ్చల్యంబు గన్ గ్రుడ్లు భయము
కను బొమల్ స్థిరములు కంటి రెప్పలును!
అర మోడ్పు కనులను విరియు కాంతులను
గ్రింద ముఖంబునం జిందెనో యనగ!
ముక్కున లక్ష్యంబు ముడివెట్ట బడిన
యోగము నందున్న యోగీశ్వరాత్ము!
ఆ పరమేశ్వరు నా సదాశివుని
బంచబాణుండంత గాంచె గన్నులను!

మెఱుపు లుఱుములు లేని మేఘంబు వలెను
అలలు దోల్కని నీటి కొలని భంగిగను!
నిర్వాత స్థలమున నిశ్చలం బయిన
దీపంబు మాడ్కిని దేజరిల్లుచును!
ప్రాణాది వాయువుల్ బట్టి బాధించి
ఆత్మసంయమమున నలరి యున్నట్టి!
ఆ పరమేశ్వరు నా సదాశివుని
బంచబాణుండంత గాంచె గన్నులను!

నేత్ర మధ్యమునుండి నిడివిగా జనుచు
బ్రహ్మ కపాలంబు పై కేగి యెగసి!
జ్యోతి ప్రవాహముల్ కాంతి వ్యాపింప!
శిరమున దేజంబు జిందగా నపుడు!
తామరతూటి దారము సన్నితంబు
బాలచంద్రుడు గూడ వాడె ననిపించు!
అట్టి దపసున యున్న యా సదాశివుని
బంచబాణుండంత గాంచె గన్నులను!

నవరంధ్ర ద్వారముల్ నయముగా గట్టి
మనసును హృదియందు మహిత సమాధి!
నిలిపి క్షేత్రజ్ఞు లతి నిర్మల భక్తి
యే నాశరహితుని యే పరమాత్మ
తెలిసికొం చుందురో తేట తెల్లముగ
యట్టి యా పరమాత్మ నవలోకనమున!
నన్నట్టి యాహారుని యున్నతోన్నతుని
బంచబాణుం డంత గాంచె గన్నులను!

అట్టి యా పరమేశు నా త్రిలోచనుని
గని గాని మదనుండు గటగట వడియె!
చూపె శక్యముగాక జూడ్కులు జలింప
భయమున వడకుచు బట్టు దప్పుచును!
శరచాపములు చేయి జారివం గూడ
తెలియకబోయెగా గలయంగ మనసు!

తన మనోధైర్యముల్ దగ వ్యర్థములుగ
వీర్య దేజంబులు వికతమై బోవ!
సౌందర్య గుణముచే నందముల్ జింద!
తన నాదుకొనగ దా దరలివచ్చినదా!
వనదేవతలు వెంట ననుసరింపగను!
సకల లోకేశ్వరి సౌందర్య రాశి
ఆ పార్వతీదేవి యచటికిన్ రాగ
బుష్పధన్వుండంత బొలుపుగా గాంచె!
కెంపుల శోభల సొంపిల్లు చుండ!
నా యశోకపు బూలు నలరారె గురుల!

బంగారు కాంతులు బొంగారుచుండు
కర్ణికారము జేరె కర్ణంబు లందు
ముత్యాల శోభల మురిపెముల్ జిందు
వావిలి బూదండ యొప్పె హారముగ!
వాసంత ఋతువున వనముల విరియు
బూవుల ధరియించి పూబంతి వోలె!
పరమేశు సన్నిధికి బార్వతీ రాగ
పుష్పధన్వుండంత బొలుపుగా గాంచె!

స్తన భారమున బహు సరసత నొప్పి
అరుణార్క రాగముల్ సతిశోభం బొప్ప
వస్త్రముల్ ధరియించి వయ్యారముగను
పూలగుత్తుల బర్వ బొలుపుగా నొంగి!
చిగురుల యందాలు చిత్రముగ వెలసి
లాలిత్యగతి బోవు లతయేమొ యనగ!
పరమేశు సన్నిధికి బార్వతీ రాగ
పుష్పధన్వుం డంత బొలుపుగా గాంచె!

పార్వతీదేవి కటి విరిసిన పూల
పొగడ దండను జూడ బొలుపుం జిందు!
స్మరుని బూవింటికి సంధింప బడెడి
మఱియొక మౌర్వి యన మహిం గోచరించు!
మాటిమాటికి జారి మాధుర్య మొలుకు
అవలంబమానయై యలరు సుందరిని!
పరమేశు సన్నిధికి బార్వతీ రాగ
బుష్పధన్వుం డంత బొలుపుగా గాంచె!

సురుచిర నిశ్వాస సుందరత గోరి
బింబాధరము జెంత బ్రీతి జరించు!
సంభ్రమ మగుదృష్టి సరసలోలతను
మసలెడి తుమ్మెదను మాటి మాటికిని
లీలార విందంబు లీలగా విసరి
వారించు చున్న యా వనిత కల్యాణి!
పరమేశు సన్నిధికి బార్వతీ రాగ
బుష్పధన్వుం డంత బోలుపుగా గాంచె!

రతియైన సిగ్గువడు లావణ్యమూర్తి
సర్వాంగయముల సౌందర్య మొప్ప!
అందాల రాశియా నేరు బార్వతిని
మదనుండు జూచి తా మది నిశ్చయించె!
దుర్దయుండైన యా శివుని కార్యమున
తన గార్యసిద్ధిని దగు నాశ జెందె!

ఆ పార్వతీదేవి యా శైల తనయ!
కాగల పతియైన కల్యాణమూర్తి!
ద్వార ప్రదేశమును దరిజేరె నంత!
వీక్షింప సాగె నా విభుని యాజ్ఞలకు!
పరమాత్మ యనుపేర బరగు నా జ్యోతి!
యాత్మను దర్శించి యానంద మయుడు
యోగము జాలించె యోగీశ్వరుండు!
తపసును జాలించె తగ నీశ్వరుండు!

బంధించి వాయువున్ బరగ నా శివుడు
తపసున నున్నపుడు దగ దేలికగను!

తన ఫణాగ్రములతో ధర మోయుచున్న
ఆ యాదిశేషుడు నా సహస్ర ఫణి
ధరను మోసినవాడు నాగసంత శివుడు!
దపసును వీడంగ దగ కష్టమాయె !
శివుడను నుచ్ఛ్వాస నిశ్వాసములను
వీరాసనము వీడె వేడ్క మీర!

నాగభూషణునకు నందికేశ్వరుడు
వందనంబులు జేసి జిందె వినయంబు
శుశ్రూషకై వచ్చు సుమతి యనిపలికె!
బలుకగా గనుసన్న జిలికె నీశ్వరుడు
ఆ నందికేశ్వరుడు నా శైలసుతను
యనుమతించెను లోని కరుగ శుశ్రూష !

ఆ పార్వతీదేవి యా సఖీజనము
చిగురులు వాసంత చిత్రములైన !
తోరంబు గిరిజ దా గ్రుచ్చిన పూలు
నా పరంజ్యోతికి యా సదాశివునకు!
పాదసన్నిధియందు ప్రణాములు మ్రొక్కి
వెదజల్లినా రప్పుడు వేడుక మీర!

పార్వతీదేవియు బరగ నా భవుకు
ఆత్మనమస్కార మర్పించె నపుడు!
నీలాలకములందు నిండు శోభలను
నవకర్ణికారంబు నయముగా జార
కర్ణమం దుంచిన కాంతి పల్లవము
జారునటు వంగుచు దర్శించి మ్రొక్కె !

మ్రొక్కిన శైలజన్ ముదముతో శివుడు !
నాశీర్వదించెను కలరి శుభదృష్టి !
“సవతులు లేనట్టి సతివి గమ్మంచు!
ఉత్తము పతిచేప్రి నొందుమా!” యంచు
ఆమాట నిజమాయె నటులెయగా గాద !
మహితాత్ములగు వారి మానితంబైన
వచనముల్ వృథగావు వశ్య వాక్యములు !
బరగ సత్యము లౌను బాటిల్లు ధరను !

పూలబాణము వేయ బూని మన్మథుడు
నెదురు జూచుచునుండె వేడకమీర !
అగ్నిబడి మిడుత దానంతమౌ రీతి
పోగాల మొచ్చిన పురుషుని వోలె !
పరమేశ్వరుని యొద్ద పార్వతి యుండ
గమనించి మదనుడు గ్రక్కునన్ శరము
ఎక్కువెట్టిన వింటి నింపుగా మార్వి
మాటిమాటికి ముట్టె మది దొట్రువడగ !

మందాకినీ యందు మెండుగా బూచి
వికసించు దామర విత్తులం దెచ్చి !
సూర్యకాంతుల జేత శుష్కింప జేసి
యక్షసూత్రము జేర్చె యాశైల తనయ !
ఆలోక కల్యాణి యాగిరి పుత్రి
యా మహా తపసికి యాత్రిలోచనుకు
అరుణారుణములైన హస్తాల చేత
నర్పించె జపమాల నతిభక్తి తోడ !

ఆశ్రిత రక్షకుం డా మహాశివుడు !
తావళంబును గొన దగ సమ్మతించె
అదె ! సమయం బని యా మన్మథుండు
సమ్మోహనాస్త్రము సమ్మోదముగను
విడువగా నుంకించి వేడుక మీఱ
తనవింట సంధించె తడబాటు వడుచు !

మదనుడా బాణంబు మఱి వేయ నపుడు
హరుని ధైర్య మొకింత యట్టిట్టు లూగె !
చంద్రోదయారంభ సంద్రంబు మాడ్కి
గాలికి గదలెడి కలువపూ విధము !
బింబాధరోష్ఠయా సంబ మోమునను
తన విలోచనములు దన్మయంమందె !

ఆ సమయంబున యా శైల తనయ
శృంగార భావాన దులకించె నపుడు !
అప్పుడే పూచిన యందాల కడిమి
పులకించి నటులుగా బులకరించుచును !
సిగ్గుతో నిండియు నిగ్గు లొల్కుచును
బెదరిన కనుజూపు బేల తనంబు !
ముఖమున గాంతుల ముత్యాలు గురియ
తల నడ్డముగ ద్రిప్పె తరుణి యా గిరిజ !

అంతట నా శివుం డా జితేంద్రియుడు
మనసు వికారమై మది చలించుటను !
తనకు దానే మది తన నింద్రియముల
తనవశమును జేసి తగ నివారించి !

ఈ చిత్త కల్లోల మీ చంచలతకు
కారణంబును గన గలయంగ జూచె!

నాలుగు దిక్కుల నరయంగ శివుడు
ఒక ప్రాంతమున గనె నొకరంగ మదను !
కుడికంటి జంటలు గిదారుగా మట్టి
నారి సారించుచు నయగారమునను !
ఒంచిన భుజములు నొప్పగా నుండి
యెడమ కాలును వంచి మండలాకార
మునసున్న ధనువును మోదమున వంచి !
పూలబాణమ్మును బోలపుగా వేయ
ఊపిరి బిగబట్టి యుత్సాహ గరిమ
మనోవ్యాకుడై యున్న మదనుండు బోడమె !

ఆ త్రిలోచను డంత నా స్మరు జూచి
యతికోపమును జెంది యలరె క్రోధమున
తపసు సంపర్శచే దగ వృద్ధి నొంది
కోపము దాపము గొమరొప్ప గూడి !
చూడశక్యముగాని జూడ్కులతోడ
నతిభయంకరుడయ్యె నా త్రయంబకుడు !
మూడవ కంటిని వెడలె నగ్నులును !
జ్వాలలు మెఱుపులు గాల సర్పముగ !

ఓ ప్రభూ ! ఓస్వామి ! ఓ మహాదేవ !
ఆశ్రితరక్షణా ! యానందమూర్తి !
శాంతింపు ! శాంతింపు ! శాంతింపు మనుచు !
ఆకాశ మందుండి యా దివౌకసులు !

పలుకుచుండగ నంత పంచబాణుండు
భవునేత్ర వహ్నిచే భస్మంబు నాయె!
మదనుని భార్యయా మాధుర్య మూర్తి!
ఆ రతీదేవి యదంతయుం జూచి!
భర్త భస్మంబౌట భరియింప లేక
మూర్ఛ నందెను మోహంబు గ్రమ్మ!
భర్తృ వియోగంబు బాధింపకుండ
నుపకారమే మోహ మొప్పగా జేసె!

ఆ తపోనిష్ఠుడు నా త్ర్యంబకుడు
తన యోగ దపముల దగ భంగమునుచు
పిడుగు వృక్షము గూల్చి యడచెడి రీతి
మదనుని సమయించి మరుక్షణ మందె!
స్త్రీ సన్నికర్షంబు ఛేదించు నిచ్ఛ
బ్రమదులతో గూడ పరమేశు డపుడు
జనె నెటో దూరము గనిపించకుండ!
ఆ కొండ నొక చోట నలరె ధ్యానమున!

ఉన్నత శిరస్కుండు సర్వభారకుడు!
తన దండ్రి కోరిక దగవ్యర్థమగుట!
తన యందచందముల తన మనోరథము!
భంగము లగుటచే భరియింప లేక!
ఈ యవమానంబు నీ పరాభవము!
తన చెలు లెదు టిట్లు దారసబడుట!
కడు సిగ్గుతో గౌరి కలతభావమున!
భవనాభిముఖియౌచు బయనమై పోయె!

రుద్ర కోపంబుచే యద్రిజ యపుడు
కలతను భయపడి కనులర మూసి!
చింత జెందుచు నున్న జిన్నారి జూచి
హిమవంతు డపుడు దా కొమరిత జేరి!
చేతులం బట్టుక జేరదీసికొని!
దంతలగ్నంబైన తామర దూటి!
నైరావతము వలె నటు కొని పోయె!
దీక్షీకృతాంగుడై దిశ తన గృహము!

తృతీయాశ్వాసము సమాప్తము



# శ్రీ గిరిజా కళ్యాణము

## చతుర్థాశ్వాసము

### పతి వియోగముచే రతీదేవి విలపించుట

ఆ మన్మథుని భార్య యారతీదేవి
యా త్రయంబకు జేత నటు తన భర్త!
భస్మమాటను గాంచి పడెను మూర్ఛలను!
నటు కొంతసేపటి కలరి తేరకొని
ఆ మహాసతి రతి యడలి గొంతెత్తి
నూత్న వైధవ్యంబు వెతను శోకించె!

మూర్ఛ దేరిన రతి మోహము బాసి
యువధానబరముగా నటునిటు గాంచె!
తన విలోచనములం దశదిశల్ బఱపె!
గనబడదయ్యెగా గాంతుండు మరుడు!
తన పతి గాంచగా దత్తర పడుచు
వేదనా శోకముల్ వెంబడింపగను!

ఓ జీవితేశ్వరా! ఓ ప్రాణనాథ!
-జీవించి యుంటివా? జీవంబు తోడ?
అని లేచి దుఃఖాన నాయాస బడుచు
కట్టెదుట గాంచెను కలికి యా ధరణి!
హరుని గోపానల నాహుతిం బొంది
పురుషాకృతిని యున్న బూడిద ప్రోవు!

మఱల నేలను వడి మది మోహమంది
భూమిపై బొరలుచు భోరున రోదను!

ధూసర వర్ణంబు దూలు నంగముల
విరిసి వ్రేలాడెడి కురులతోఁ గూడి!
ఆ శివాశ్రమ ప్రాంత మంతెనుఁ గూడ
సమదుఃఖ భూమిగా సఖియ వే జేసె!

లోకోత్తరమునై న లోకాన లేని
సుందరంబై న నీ సుకుమార దేహ!
మీఁగతి నొందెనా? యెట్టి చోద్య మిది?
హా ప్రాణనాథ! ని న్నరసి యీ విధము!
బ్రతికి యుంటిని నేను భాగ్యహీనతను!
కఠినులు స్త్రీలం(దు గద నిక్కవంబు!

నీరము లేకున్న నీరజం బెటుల
వేయి రేకలతోడ వికసించి మించు?
నీవు స్వార్థనై నిలిచి జీవించు
వదలి కన్నెటు బోతి వెనుకుదు నన్ను?
ఆ స్నేహ మా భావ మా ప్రేమ లతను
ద్రుంపి వేసితివిగా దుత్తూలికలుగ!

నీకు నేనును నాకు నీవ్రను గూడ
నప్రియంబులు గాని యకృతంబులును!
జరిగిన సంగతి జాడలు లేవు!
మఱియొందు కిట్టుల మనుత బాసితివి!
నిను జూడ దుఃఖంచు నీ రతి నిటుల
దపియింప న్యాయమా? దర్శన మీవ?

రాత్రి వేళలయందు రతివేళ లందు
ఆనందమున దేలి యలరెడి యపుడు!

గోత్రాక్షలితముం గోపంబు నంది
మొసాలితో నిన్ను మెలిపి పెట్టగను!
నల్ల గల్యాను గొట్ట నాథ! నీ కనుల
బుప్పాడి పడి బాధ నొందిన మతిని
ఈ విధి నను విడి యొంటకు బోయితివా?
యీ తప్పులిక జేయ నింక మన్నించు!

"ఓ రతీ! ఓ సఖి! ఓ ప్రియా! వినుము!
నీవు నా హృదయమందు నిలిచి యుంటివిగ!"
అని బల్కితివి నాడు! ఆ మాట కల్ల!
మాసిపోతివి నేడు మమతల ద్రోసి!
ఆయుల నీవై పోన నెటువలె నేను
జీవించి యుంటిని జీవితేశ్వరుడ?
నన్ను రంజింపంగ నాథ! బల్కితివి!
యిది నీకు దగునేమొ! యోచించుకొనుము

నను శోకమున ముంచి నా ప్రాణనాథ!
పరలోకమునకు వే పయనమైతివిగ!
అనుసరించెద నిన్ను నాలసింపనుగ!
నే విచారింప సఖి! నేను నా కొఱకు!
ఆ విధి వ్రాతచే నటుల వంచితులు!
సర్వ జీవులకునై సంతాప బడెద!
నీ యధీనము గదా! నిఖిల సౌఖ్యములు
జగతి గతేమాను? జనుల గతేమి?

రాత్రి జీకటులచే రాజ మార్గములు
ఘన మేఘ గర్జనం గలతల పడెడి!

కమనీయ ముఖులైన కాంతల వేగ!
ప్రియులను జతగూర్చి ప్రీతి పొదరిండ్ల
పంపెడి నాథుండు బరగ నింకెవరు?
ప్రియసమాగమముల బెంచువా రెవరు?

అరుణ నేత్రములను నటు నిటు ద్రిప్పి
మాటలం దొట్రిల్లి మాటికిం దూలు!
ప్రమదల యానంద వారుణీ మదము!
నిష్ఫలం బాయెగా నీవు లేకట్టి!
జగతి శూన్యముగదా సకల జీవులకు
నానా విలాసముల్ నటనలా గాద!

ఓ నాథ! నీదేహ! మొంచిన గాథ!
సఖుడైన చంద్రుండు చలియించి మదిని!
తన వాల వెన్నెల తగ వ్యర్థ మనుచు
కృష్ణపక్షము దాటి క్రొంగ్రొత్త వెలసి!
తన కృశత్వంబును తెసదు దుఃఖముగ
గ్రమముగా నొదులుచు గలత నున్నాడు!

పసుపును యెఱుపును బాలు బంచుకుని
తొడిమతో గూడుక దోరంపు సొగసు!
పుంస్కోకిలలచేత బొలుపుల జిందు
రాగాల భావాల రసములం దేలు!
నవచూత ప్రసవము నాథ! నీ శరము!
యెవరి కార్ముక శర మికమీద నగునో!

నాథ! యీ యళిపంక్తి నయముగా గనుము!
యెడలుచు నున్నవి నటునిటు దూలి!

కఠినులు రక్కసుల్ గాద దేవతలు?
ఆలుమగలను జీల్చి యాటలాడుదుర?
ఒక పాదమందు నీ నొసర బారాశి
దీర్చగా నింతలో దేవతల్ బిల్వ!
దేవకార్యము దీర్చ ధీరత్వమునను
నెటు బోయితివో నాథ! వేగ రా రమ్ము!
దక్షిణ పాదమ్ము ధన్యతం గూర్చ
రాగర జితముగా రంజిల్ల జేయ!

ఓ నాథ! వచ్చెద! నొక క్షణ మాగు!
స్వర్గలోకము నందు జాణలౌ స్త్రీల!
వలదంచుకుండ నే వచ్చెద నిదిగో!
నీ సుందరాంకాన నిటుగా నుందు!
సహగమనము నంది సరగున వత్తు!
అగ్నిమార్గము నందు నరఃమునమును!

ఓ నాథ! ఓ స్వామి! యొక మాట వినుము!
అనుసరించియు నిన్నైన నీ దాన
మదనుంచు లేకుండ నెట్టి రతీదేవి
క్షణము జీవించెనని జనలాడు కొనర?
ఈ లోక నింద నే నెటుల భరింతు?
నీవు లేకుండ నే నెట్లుంటి బ్రదుక?

ఓ జీవితేశ్వరా! ఓ రతీ నాథ!
యీహా కిందని గతి నొంది పొందితివి!
పరలోకమున కేగి భస్మమై యున్న
అస్థ్య మంశన మెటు లలరి నే జేతు?

జీవ దేహంబులు జీర్ణ మాయె గద!
యీ స్థితి నొందితి వెందైన గలదె?

ఉత్సంగమున ధను వొప్పుగా నుంచి
శరములను దిన్నగా జక్క జేయుచును!
వాసంతు దోషింత వక్ష్మ లొల్కుచును
మధుర వాక్యములతో మాటలాడుచును
తిలకించి క్రీగంట దేలించు నన్ను
మధుర మూర్తి నిన్ను మఱను దంతు!

నా హృదయేశ్వరా! నా ప్రాణనాథ!
నీ కార్యములకు నిండు దోసిళ్ళు!
పూలను బంపించు పుణ్యవంతుండు
నీ కిష్టుడైనట్టి నీ ప్రాణ సఖుడు!
వాసంతు డెచ్చటి వెన్నెల రేడు!
కనిపింప డాయెగా గాసంగ రాడు!
హరుని కోపాగ్నిచే నాహుతియైన
మదనుని గతి నొంది క్రాగ్గెడు గద!

ఆ రతీదేవి యిట్లార శోకింప!
బరిదేవితారావం బవివి చెవుల!
విషలిప్త ముఖములౌ వేయి బాణాలు
హృదిని గ్రుచ్చిన రీతి మదివంత నొంది!
వాసంతు డదివిని వచ్చె వేవేగ!
ఆ రతీదేవిని యలరి యోదార్ప!

ఆ వసంతుని జూచి యా రతీదేవి
గొంతెత్తి శోకించె గోటి వేదనల!

ఉరమును మోదుచు నుద్వేగ గతిని
ధరణిని బొరలుచు దరుణి రోదించె!
దుఃఖితులగువారి దురపిల్లు మనసు
బంధు మిత్రుల జూచి బైకుబుకు లేచి!
తెఱచిన వాకిలిని బరుగున వచ్చి
అడ్డు లేకుండగా నంతటం దొరలు!

ఆ వసంతుని తోడ నా రతీదేవి
భోరున నేడ్చుచు బొసగ నిట్లనియె!
చూడు వసంతుడా! సుకుమారుడైన!
నీ మిత్రు స్థితిగతి నిలిచి యొక్కింత
పారావతము రంగు భస్మముం గనుము!
గాలికి నెగురుట గంటివా యెదుట?

ఓ నాథ! యిటు జూడు! నొసగు దర్శనము!
ఇదె మాధవుడు గను మిష్ట సఖుండు!
నిను జూడ నాసక్తి నిలిచి యున్నాడు!
వతనినైనను గను మాసక్తి తోడ!
క్షణికములై యుండు నతి చంచలములు!
బురుషుల స్నేహంబు పొలతుల యందు!
మెలివడు త్రాడుగా మిత్రుల యందు
స్థిరముగా నుండును ధీరత మెఱసి!

బిసతంతువుల నారి ప్రియమొప్ప గలిగి
కోమల కుసుమముల్ నీకు బాణములు!
అట్టి నీ ధనువుకు నఖిల లోకములు
యాజ్ఞానువర్తులై యణగి యుండెడివా!

హా నాథ! యట్టి నీ యతుల శక్తికిని
గారణ భూతుడై గదు స్నేహ రక్తి!
నీ పార్శ్వ వర్తియై నిలుచు వాసంతు
నతని కైసను నిమ్ము నలరి దర్శనము!

ఓ వసంతా! విను! మొక మాట యొనరి
నీ ప్రాణ మిత్రుండు నీదు చెలికాడు!
గాలి ప్రేటున సోలి తూలి దీపమ్ము
నారిపోయిన విధ మస్తమయమొందె!
తిరిగిరా డిక నుమ్మ! దేరి జూడు నను!
ఆరిన దీపమ్ము నా మన్మధుని కై
ధూమ మను దుఃఖాన దురపిల్లుచున్న
వర్తిగా నుంటిని వంది గుందుచును!

ఆ విధి చైదంబు నాశ్చర్య కరము
గాముని వధియించి గడగి నన్నాడ!
వధియింప కుందుట నొప్పగా నేను
సగము జచ్చినయట్టి చాన నైతినిగ!
అనపాయమని ద్రుమ మాశ్రయ మంది
యున్న లే లతకూన నుద్వేగ గజము
ఆశ్రయ ద్రుమమును నటు పెల్లగింప!
తీగె కూలిన రీతి తీరాయె బ్రతుకు!

ఆ పంచ బాణుతో నలరి నే గూడ
మరణించితిని గాన మాధవ! వినుము!
కావున తదుపరి కార్య మూహించి
నా చితి జేర్పుమా! నయముగా నీవు!

అగ్నిప్రవేశంబు నాకిప్పు డేల?
అగ్ని కార్యము జేసి యాహుతి నిమ్ము!
పతి బతి జేర్పంగ బిలిని వే జేర్పు!
బంధు కృత్యము దీర్పు బరగ వే దయను!
చంద్రునితో జను జారు జంద్రికయు
మేఘముతో బాటు మెఱుపు నశించు!
ప్రమదలు జనుచుంద్రు పతిమార్గ మందు!
అందఱి కిది తెలియు నవివేకులకును!

తెలియు నందఱి కిది తేటతెల్లముగ!
ఇదె జూడుము! ధరణిపై నిగ్గు లింపారు
ప్రియగాత్ర భస్మంబు ప్రేమ మీరగను!
నా శరీరము నంత నలరి బూసికొని
సుందరంబై నట్టి సుకుమారమైన
చిగురుం బాన్పున జేర్చినట్టుగను!
నా చితాగ్నుల యందు నలరి యుంచెదను!

ఓ పూల వాసంతి! ఓ ఋతురాజ!
ఓ సౌఖ్య! ఒకమాట! యొప్పగా వినుము!
పూలపాన్పులు మేము బొసగ గూర్చుటను
సాయంబు జేసితి సరసత నాడు
అంజలితో నేడు నర్థించు చుంటి
అగ్ని శయ్యను గూర్పు మతి శీఘ్రముగను!

వేగ నా చితియందు నగ్ని నర్పించి
దక్షిణ వాయువుల్ తగ వీచు నటుల!

చేయుమా! వాసంత! చెప్పగా నేఁ?
నీ ప్రాణ మిత్రుండు నీ ప్రాణ సఖుఁడు!
క్షణమైన నన్వీడి చక్క నుండఁడని
తెలియుగా వాసంత! చెలికాని మనసు!

ఇంతియే కాదయా! యింకొక్క మాట!
యీకోర్కె దీర్పుమా యిష్టమిది మాకు!
నా చితి నగ్ని యిడి సమయముగా నీవు
నొక జలాంజలి నిమ్ము నొప్పఁగా మాకు!
పరలోకముల యందు బరుఁగు నీ సఖుఁడు!
అవి ఖాద్యముఁగ ద్రావు నలరి నాతోడ!

అంత మాత్రము కాదు! యాలింపు వినతి!
బరలోక విధులను బాటించు నపుడు!
పిండోదక క్రియల బొందుగా మాకు
చిన్నారి చిగురుల జట్టి బూవులను!
ఆమ్ర పూ గుచ్ఛంబు లతి ప్రేమ నిమ్ము!
నీ సఖు రుచు లేవో నీకునుం దెలియు!

అటుల శోకించెడి యా రతీదేవి
దేహ త్యాగమునకు దివిరి పూనుకొనె!
వినువీథి యందుండి వినవచ్చె నంత
యశరీర వాక్యము లలరించు రీతి!
మడుగెండి తడబడు మత్స్య కన్యకలు
తొలకరి వానలం బులకించు రీతి!

ఓ సతీ! ఓ రతీ! యోర్పును వహింపు!
శోకంబు మానుము స్రుక్కకు మదిని!

నీ భర్త జీవించు నిజముగా నమ్మూ!
మిడతగా నెగురుచు మిలమిల నాడి!
హరుని నేత్రాగ్నిని నాహుతిం బొందె!
కలికిరో! తెలిపెద కారణ మేమొ?

ఆనాడు మన్మథుడా ప్రజాపతిని
బూలి బాణంబుల బులకింప జేసి!
కూతుపై మోహంబు గూర్చినా డకట!
యది గని యా బ్రహ్మ యాగ్రహం బంది!
శపియించె నీ పతిన్ శంకరు కంటి
మంట మాడు మటంచు మదను డిట్లయ్యె!
చేతులారగ జేయు జెడు కర్మ ఫలము
ననుభవింపగ దీర దనుమాన మేల?

మదను శాపము దీరు నద నెవ్వ డనుచు
నా ప్రజాపతి ధర్ము డడిగె నా బ్రహ్మ!
పార్వతీ దపమున శర్వుండు మెచ్చి
పరిణయ మందునో విరియును శుభము!
మదనుడు సుఖ మొందు మఱి రతిం గూడు
బోయిన దేహంబు బొందును మఱల!
అలరి జితేంద్రియు లంబుధరములు
కోప ప్రసాదాల కూడలి కాద!
నామరూపము లేక నశియింప జేయు
ప్రేమతో గాపాడ ప్రియములు గూర్చ
ఉఱుములు మెఱుపులు పిడుగులన్ రాల్చ
అమృత జలంబుల నాహ్లాద బరుప!

ఆనాడు జరిగిన యాగాథ నంత
యాకాశవాణి దా నలరి బల్కినది!

ఓ రతీ! కల్యాణి! యోర్పును వహింపు
మదనుడు జీవించు నది శోక మొదలు!
నీ శరీరంబును నిండు ధైర్యమున
గాపాడు కొనుమమ్మ! గలుగు శుభమ్ము!
ఎండ కాలము నందు నెండిన నదియు
వానకాలము నందు వరదలై రాద!

శుభవాక్యముల నిట్లు సుదతి నా రతిని
మరణ ప్రయత్నంబు మళ్ళింప జేసె!
అదృశ్య మాయె నా యాకాశవాణి!
ఆ వసంతుం డంత నలతి ధైర్యమున
సురుచిరార్థము లైన సుందరం బైన
స్మరుసతి నోదార్చె సరస వాక్యముల!

పవలంత చంద్రకళ బలు కళల్ మాసి
రాత్రి రాకను నెట్లు రంజిల్లు చుండు!
అటుల నా పతిశోకి యా రతీదేవి
కుమిలెడి మనసుతో గ్రుంకు శోకమున!
ఆపద దొలగుట కా శుభోదయము
వీక్షింపగా దా నిరీక్షింప సాగె!

[చతుర్థాశ్వాసము సమాప్తము]



# శ్రీ గిరిజా కళ్యాణము

## పంచమాశ్వాసము

### పార్వతీదేవి తపసునకు బూనుకొనుట

ఆ త్రిలోచను జేత నా మనోభవుడు
దగ్ధమాటను గాంచి తన మనోరథము!
భగ్నమాటను గౌరి భరియింపలేక
నిందించుకొనె! తన యందచందముల!
సహజమే గుణరూప సౌందర్య ఫలము
గోరిన వల్లభు వరియించుటేగ!

అంత నా గిరిపుత్రి చింతలం బాసి
యపురూప సౌందర్య మాత్మ దా గోరి!
తపసుచే బరమేశు దా వరియింప
దపమాచరింపంగ దగ నిశ్చయించె!
కానిచో నారీతి యనురాగ ఖనిని!
యా మహిమాన్వితు నందునా పతిగ?

ఆ గిరిపతి సతి యా మేనకయును!
తన పుత్రి పార్వతి తగ త్రయంబకుని!
తపసుచె వరియింప దగ నిశ్చయింప!
యని విని మేనక యావేశ బడుచు!
కూతు వక్షస్థలిం గూర్మితో జేర్చి
మునివృత్తి మానుమం చనియె నిట్టులను!

"నా కుమారీ! పుత్రి! నా ముద్దు బిడ్డా!
తపమొద్దు! తపమొద్దు! తపమొద్దు! తల్లీ!

పూజింప దలచిన బూజింపు మమ్మ!
ఎందఱో దేవత లింట నున్నారు!
తపసుల కఠినమా తప సెచ్చటమ్మా?
గిల్లిన బాల్గారు తల్లి నీ వెచట?
అతి కోమలంబైన యీ శరీరంబు
భ్రమర పాదంబును భరియింపుగాని!
పక్షిపాదము వెట్ట భరియించు నెట్లు?
తప మొద్దు! తప మొద్దు! తప మొద్దు! తల్లి!"

ఆ రీతి మేనక యలరి పుత్రికను
దపసు మాన్పింపంగ దగ బ్రయత్నించె!
స్థిర నిశ్చయంబైన గిరిపుత్రి మనసు
వారింపగా నామె వశము గాదాయె!
నిమ్నాభిముఖమైన నీటిని మఱల
మళ్ళింప శక్యమా? మహి నెరికైన?

స్థిరచిత్తురాలైన ధీర యీ గిరిజ
తన కోర్కె నెఱిగిన తన తండ్రి కపుడు!
కోరిక ఫలియింప గొనదాక శివుని
తపసు జేయంగను దగ నుంత నడవి!
దృఢమైన కోరిక ధీరచిత్తమును!
తన సఖిచే వార్త తండ్రికిం బంపె!

అంత నా హిమవంతు డలరి పుత్రికను
ధీర చిత్తంబును ధైర్యంబు మెచ్చి!
తపసు జేయంగను దగనుండ నడవి
ఆజ్ఞతో బాటుగా నాశీర్వదించె!

గౌరి శిఖరం బిది గౌరవంబునను
మనచేత నేటను మన్నన నందు!
ఎచట జూచిన నెమిల్లింపుగా నుండు
నాకొండ కేగెదు నా శైల తనయ!

అడ్డు పెట్టగరాని యా గౌరి దీక్ష
యాకొండ శిఖరాన యా మహాదేవు!
ఆ భక్త వత్సలు నా పినాకిని
ప్రార్థింప సాగెను భక్తి తోడుతను!

తన మెడ గంధంబు దారాడు చుండు
ముత్యాల హారాలు మోడవా నగలు!
తొలగించి వేసెను బాలార్క ప్రభల
నారచీరలు గట్టె నయముగా నపుడు!

తపమున సున్న యా తరుణి శైలజకు
జడలు గట్టెను కురుల్ నరస శోభలను!
భూషితాలకలతో బొలుపుం జెందు
యందాలు విరిసెనో యా మోము నేడు!
జడలు గట్టిన గూడ విడునదు సొగసు!
నాటి సుందరములు నటనాలు సలుపు!
సహజమే! తామరల్ సరసుల యందు
దుమ్మెద బారుల సొంపుకే గాదు!
శైవలాంగము సరసతం గూడ
యందాలు జిందును నతి సుందరముగ!

ముప్పేటలను గల్గు ముంజి త్రాడపుడు
ధరియించె యుమ కటిన్ పరిసెను నగగ!

ఒరసిన యపుడెల్ల యొడలు ఝల్లనఁగ
రోమాంచముతోడ నొప్పె నా గిరిజ!
ఆ ముంజి త్రాటిచే నట కటి నొరసి
యరుణారుణ ప్రభ లందె శోభను!

ఆ లోక కల్యాణి యా శైల తనయ!
తపసున దా మగ్నె దన్మయము తోడ!
అధరోష్ఠము యందు నా లాక్షరసము
బూయుట మానెను బొలుపుగా నపుడు!
అంగరాగములచే నటు యొల్ల వడెడి
కందుకమును బూన నుండె మానినది!
లేత దర్భలు కోయు లే సూర్య కాంతి!
అక్షసూత్రమ్ము విడ దంగుళుల యందు!

చిన్నారి చిరుగుల పొన్నారి శయ్య
బవళించు సమయాన బడి జడరాలు!
పూవుచే సహితము బూను క్లేశమును
అట్టి యా సుకుమారి యేలదు నీ నాడు!
బాహువు దిండుగా బరగ జేసికొని
నేలపైని బరుండు నేల గూర్చుండు!

సవిలాస చేష్టలున్ సవిలోల దృష్టి
తపవృత్తి కా రెండు దానని దంచి!
మఱల గైకొనుటకు మాధుర్య మొలుక
నా రెండు వస్తువుల్ నటదాచె నేమొ!
సన్నని తీగెలం సరస చేష్టలును
హరిణాంగనల యందు నా చపల దృష్టి!

అన్నట్టులున్నది యా శైల తనయ!
తాపసవృత్తిని దగ మున్గిపోయె!

తన తపోవనమందు దన యాశ్రమమున
బోలు పొందు తరులకు బూల తీగెలకు!
స్తన్యపానము వోలె దగ నీరు పోసి!
పుత్రవాత్సల్యముం బోలుపుగా బెంచు!
సంతానవతియైన తరువాత గూడ
తానుగా బెంచిన తరుల తీగెలను!
మురిపాలు జిందగా ముద్దుగా జూచు!
సుతప్రేమ మఱలదు సుతయు గూడ!

ఆ తపోవనమందు నా శైల పుత్రి
హరిణములను బెంచు నాప్యాయముగను!
నీవార ధాన్యముల్ నింపుగా బెట్టు
అడవి ధాన్యంబుల నందించు ప్రేమ!
వెంటాడు హరిణము లంటు పాదములు
ఒడియందు గూర్చుండు విడని మచ్చికను
గిరిజయు తన కనుల్ హరిణ నేత్రములు
నౌత్సుక్యమున గొల్చు నలరి చెలు లెదుట!

స్నానాది జపములు సరసత నొప్ప
అన్న కార్యములందు నలసత లేక!
వల్కలంబులు గట్టి వల్లించు స్తుతులు!
ఇట్టి గౌరిని జూచి యరుదెంత్రు ఋషులు!
ధర్మ వృద్ధులయందు ధర్మ జ్యేష్ఠను
వయసెన్న రాదన్న వచనము వినమె!

ఆ పార్వతీదేవి యా తపోవనము
పరమ పావనతను బడసి పెంపొందె!
గో-వ్యాఘ్రములు నట గూడి జీవించు
చిలుకలు పిల్లులు స్నేహంబునుండ!
తరువులు తీగెలు తగ బూతోడ
అతిథి సత్కృతులచే నాదరించునగ!
నవ పర్ణశాలను నయముగా నచట
యగ్ని కార్యముసేయు నాహ్లాద మొదవె!

తా గోరు ఫలమును దక్కనట్టి తపము
చాలదంచు దలంచె చాల యా గిరిజ!
కుసుమ కోమలమైన కూర్మి దేహంబు
సుకుమారతను విడి సుదతి వేవేగ!
కఠినమౌ తపమును గడగి జేయగను
కృతనిశ్చయంబయ్యె సతి శైలతనయ!
కందుక లీలలన్ గష్టంబునందు
అట్టి పార్వతి నేడు నలసట లేక!
మునుల కృత్తిని నేడు మోదంబు నంది
కఠినమౌ తపసుల కార్యంబు బూనె!
ఆ గిరిజ నేర్పులు నబ్బురంబు గద!
కాంచన పద్మంబు గాబోలు తనువు!
పద్మ స్వభావంబు బాసె మెత్తనయు
గాంచన భావంబు గఠినమై నదియు!
గ్రీష్మంబు గురియు నా గ్రీష్మకాలమున
పంచాగ్ని తపమును బరగ జేసినది!

నలుదిశల్ వెలిగెడి జ్వలితాగ్ని శిఖల
గూర్చుండి నయముగా శిరము పై కెత్తి!
ఐదవ యగ్నిగా నా యందు సూర్యు
తేజమున్ వీక్షించి తేజస్సు నందె!

ఆ లోక కల్యాణి యాశివు గొఱకు
నా మహా దపమును సలరి జేయగను!
సూర్యుని కిరణాల సురు చిరం బైన
కమలకాంతులు నొప్పె గలికి ముఖంబు!
నేత్రాంతముల యందు నెమ్మ నెమ్మదిగ
శ్యామల వర్ణంబు సరసత్వ మొప్పె!

ఆ దేవి శైలజ యట్టి యా దపము
ఘోరమా నియమముల్ గూర్మి పాటించె!
అదుగాక లభియించు నా వర్ష జలము
చంద్రకాంతుల దేలు సాంద్ర శేఖలను!
ఆహారముగ గొని యా విధి నుండె
వన వనస్పతి వోలె యొప్పారు గులికె

తపియింప బడినట్టి తి ప్తమై నట్టి
సూర్యకిరణాలచే సుక్కి యున్నట్టి!
తొలకరి వానలం బులకలం గలిగి
భూమాత యావిరుల్ పై లేచు రీతి!
పంచాగ్ని దపమున బరగిన సెగలు
పతిత ప్తమైనట్టి యా శైల తనయ!
బరగు దేహము నుండి పై లేచె నూష్మ
మా తేజ మంతట నల్లుకో సాగ!

తొలివర్ష బిందువులు దోరంపు భక్తి
తపసునందున్న యా తన్వి పార్వతిని!
కనురెప్పలం బడి కదలి యా చోటు
చెంపల బడి యంత హృదయముం జేరి!
మదియందు గల శివు మహనీయపు భక్తి
నభిషేకమును జేయ నరిగిన ట్లుండె!

ఆ వర్ష ధారల యా గాలు లందు
దపము సేయగ బూనె తన్వి యా గిరిజ!
ఆశ్రమంబును విడి యాశ్రయం బొందలి
బండరాళ్ళ వసించు బయలైన చోట్ల!
ఆ పార్వతీ దేవి యా ఘోర దపము
సాక్షులా యన్నట్లు సాంద్రమౌ శిలలు!
మెఱుపు తీగల తోడ మిలమిల మింట
గంటి జూపులతోడ గనుచున్న వనిత!

మంచు కాలమునందు మించుగాలులను
చల్లని రాత్రుల జలిగాలు లందు!
నీటిలో నివసించి నిఖిలేశు శివుని!
తపము సేయగబూనె తరుణి యా గిరిజ!
అన్యోన్య మెడబాసి యా చక్రవాక
మిథునంబు నల్లుపులు హృదయంబు గదల!
చూచుచున్ రాత్రుల సుడివడి మనసు
కొంతకాలము గడిపె గొంత దపమిట్లు!

పద్మరేఖల వంటి పెదవుల గలుగు
బద్మ సుగంధియౌ పార్వతీ దేవి!

ఆ మంచు కాలమున యా నీటి యందు
దపము సేయుచు నుండి దగ నిట్టు లుండ !
హిమవృష్టి గ్రుంగిన పద్మ సంపదల
దరిగిన శోభలం దనవృద్ధి సేయ !
నీటికిం గూర్పగా నీరజ నేత్రి
తపము సేయుచు నున్నదని యనిపించు !

రాలిన బెట్టాకు రహిం జీవనముగ
జేకొని దపమును జేసెటి విధంబు !
తాపస వృత్తిని దరికొను వారు
ఉన్నతముగ గదా ! యెన్ని కీర్తింత్రు !
ఆ పార్వతీదేవి యదియును వదలి
తపసు జేసెను బహు దరగని భక్తి !
అందులకే యందురు నందరి కోవిదులు
అమె 'నపర్ణ'గా నతులిత భక్తి !

కుసుమ సమానమౌ కోమలం బైన
దేహంబు గలిగిన ధీర యా గిరిజ !
అన్నాన్న జలస్థల మంతట విడిచి
తపసు చేయగ బూనె దాపస వృత్తి !
కఠిన శరీరులౌ తాపస మునులు
జపముల తపముల సాధించి నట్టి !
ఆ తపో ఫలముల యా దివ్యతేజ
మ్మధిగమించెను నుమ యతిశయంబుగను !

ఆ పార్వతీ దేవి యటు సేయ దపము !
అంతట నొకనాడు నా తపోవనము !

లేడి చర్మము దాల్చి నిండు తేజమున
మోదుగ దండము ముదమునం దాల్చి !
బ్రహ్మ తేజస్సుం బ్రజ్వరిల్లుచును
ప్రౌఢ వాక్కులతోడ బరిఢవిల్లుచును !
ప్రథమాశ్రమం బిట్లు బరగ మారెనన
యొకజటాధరు డట నొప్పుగా వచ్చె !

అతిథుల భక్తిని యాదరము సేయు
నా పార్వతీదేవి యాజటాధరుని !
బహుమాన పూర్వక బహు సపర్యలను
అతిథిపూజలు జేసి యాదరించినది !
సరిసమానుల నైన సాధుపుంగవులు
నాదరింతురు గదా ! యతి గౌరవమున !

అతిథి పూజలనంది యా జటాధరుడు
నాయాంబ బిలిక నలరి దీర్చికొను !
వినయమున నటియించి విమల దృక్కులను
బార్వతిం జూచుచు బరగ నిట్లనెను !

హోమాది క్రియలకు సమిధలుం దర్భ
లొప్పుగా దొరుకుచు నున్నవా తరుణి ?
స్నానాది విధులకు సరస జలంబు
లభ్యమగుచున్నదా లావణ్య జెలువు !
శక్తి నిదపమును రక్తి జేయుచును
'శరీర మాద్య' మను సామెతం దెలిసి
ఆమాట మఱువక ననుసరింపుచును !
నుంటివా? గుణవతి ! యొప్పుగా దెలుపు !

స్వాగముగా నాటిన సరస నీరమున
పెరిగి వర్ధిల్లిన ప్రియమైన లతలు!
చిగురులు పెంపొంది చెన్నొందె నివియ?
తాపస వృత్తిచే దహజె! నీ పెదవి?
ఎత్తుం బూనక ఎలితారుణిమలు!
బాహుల వర్ణంబు బరగిన రీతి!

నీదు కన్నుల బోలు నిండు చంచలత
యనుకరించుచునున్న హరిణ కూనలును!
విశ్వాస దృష్టిచే వెన్నంటి వచ్చి
దర్భ చివురుల నోట గఱచిన యపుడు!
కోపించ బోవుగా కోమలీ! నీవు!
అతి ప్రసన్నము తోడ నాదరింతువుగ!

ఓ పార్వతీ! విను! మొచర సౌ దర్య
మిల పాపకర్మముల నలరి చేయదను!
మాట సత్యము సుమా! మఱి నీవె సాక్షి!
ఓ విశాలాక్షిరో! ఒక మాట వినుము!
సదయ సద్వృత్తిని దాపసులకును
ఆదర్శవర్తివై యలరితి విపుడు!

సప్తర్షిగణముచే సంసతం బలుల
వెదజల్లు బూవుల విమలతం గూడ!
అంతరిక్షమునుండి యటు జారి వడెడి!
గంగా ప్రవాహంబు గతిచేత గూడ!
ఆ హిమవంతుండు నా మహీధరుడు
నంతటి పరిశుద్ధ మత డొందఁ లేదు!

నిష్కళంకంబైన నీ చరిత్రలను
వంశ పావనుడయ్యె నొప్పుగా నతడు !

ధర్మార్థ కామముల్ ధర్మ మొక్కటిని
స్వీకరించితి వీవు స్థిరకాంక్ష తోడ !
నీ విట్లు గావింప నీరజముఖిరో!
ఇదియె నిక్కమని యింపుగా దోచె !
అర్థ కామములకై నటు నిటు బోక
నిలిపితి వీ దృష్టి నిందు ధర్మమున !

సౌందర్య రాశి! యో సన్నుత గాత్రి !
నీదు పూజలచేత నెంతయో నేను !
ఆత్మ సంతృప్తిచే నలరితి నన్ను
అన్యగా భావింప నర్హంబు గాదు !
సత్పురుషుల తోడి సాంగత్య మిలను!
సాప్త పదీనంబు సఖి నీకు దెలియు!

ఓ తపోధనురాల! యో చారుశీల!
ఆ స్నేహ హేతువు నట్టి మక్కువను!
బ్రాహ్మణ చాపల్య భావముం గొంత!
నడుగుచుంటిని దేవి! మంబుజ! వదన!
గోప్యంబు గానిచో గోమలీ! నీవు!
ప్రత్యుత్తరం బిమ్ము! బరగ స్నేహమున!

పరమ పావనుడైన బ్రథమ వేధసుని
వంశముం జనియించి వాని కెక్కితివి!
మూడు లోకంబుల మోహనత్వంబు
ఒక చోట నుదయించి యున్నట్లు దోచు!

ఐశ్వర్య భాగ్యమా యడుగంగ నేల?
వయసు నూతనమును వాసిగా నీకు!
ఏని కంటెను పట్టి వేని సాధింప
దశమాచరించుటో తగ వివరింపు!

బంధులచే గాని భర్తృ జేత
భరియింపగా రాని బాధల వలన!
వీరకాంతలు నెట్టి ధీర తపంబు
జేసిరి జగమందు స్థిర చిత్తములను!
అట్టి విచారముల్ కలగడి లేదు
ఓ కృశోదరి దెల్పు మొప్పగా నాకు!

ఆపురూప సౌందర్య మందచందములు
శోక మిదెందుకు? సుముఖి! నామాట!
పితృ గృహంబుల బొందుగా నీకు
బంధుజనంబుల బాధయు లేదు!
ఇతరులచే నైన యిడుములు లేవు,
పన్నగరత్నముం బాహువున్ సాచి!
ఎవ్వడు గ్రహియింప నిచ్ఛను గోరి?
గాన నీ దశమున గారణం బేమి?

ఈ యౌవనమునందు నింపు సొంపెసగు
నాభరణంబుల నటు త్యజించితివి!
వార్ధక్య శోభిత వల్కలంబులను
ధరియింపబడియెను తరుణి! నీచేత!
చంద్ర తారకముల సాంద్రమా రాత్రి
అల యనూరుని జేర యారాలవడునె?

కావున దెల్పుము! కలికి! నీమనసు
మాటున విహరించు మధురిమల్ జింద!

దినమును బొందగా దివ్య తపంబు
జేయుచు నుంటివా; చెలి! యది శ్రమయె!
నీ తండ్రి సౌధములు నిరుపమానములు
స్వర్గ భూముల మించి సౌందర్య గరిమ!
వసుధ బొందగ నిల్లు దరుణి; దపంబు!
జేయుచునుంటివా చెలి! యింక చాలు!
రత్నంబు వెదకునా రమ్మంచు జనుల!
రత్నముం వెదకంగ రంజిల్లు జగము!

నీ వేడి నిట్టూర్పు నిశ్వాస జేత
నంకయుం బొక్కుడు సరగున మదిని!
తోచుచు నున్నది తొయ్యలీ! నీవు
గోరిన వరునికై కూర్మి యీ తపము!
చేయుచున్నావంచు జిందె నా మదిని!
ఈ మూడు లోకాల నిందు సందునను!
కోరగా దగువాడు కోమలీ! గలడ?
కనిపింప డెందునుం గమలాయతాక్షి!
కోరగా బడియును గోరిక మీర
బొందజాలని వాడు భువియందు గలడె?

ఎంతటి చిత్రంబు! నెట్టి వింతయుకొ?
నీవు గోరిన వాడు నిద్దయుండు గద!
కోపియు! కఠినుండ! క్రుద్ధుండ! సిద్ధుడు!
చాల కాలమునుండి సరసత్వ ముడిగి!

కర్ణోత్పలములను గరము దొలగించి
వరమొక్కలను బోలు పసుపు రంగులను!
చెక్కిళ్ళ యందున జిందు ప్రేలాడు
జటలతో నొప్పెడి ఛాంజనుం డేమొ!

మునివృత్తి వరియించి మునిగి తాపసిగ
కృశియించు దేహంబు కూర్మి భూషణ!
ధరియించు తావులు సూర్య కాంతులను
కమిలి శ్యామలములై కాంతుల వీడె!
పగటి చంద్రుని వోలె బరితాప మొందు
గనికరం బెవరికి గాదు నిన్జూడ?

సౌందర్య గర్వాన సాహసుండైన
నీయిష్ట సఖుని నే నిరసింతు సుమ్మ!
వంచితుండైన నీ వల్లభుం గౌరి!
మందమతి యంచు నే మనసునం దలతు!
అందమౌ చూపుల నలరు నీ ముఖము
కనుబొమల్ వర్ణింప కాంత! సాధ్యంబె?
నీకు లభ్యముగాక నిను వరింపకను!
దూరమున్నట్టి దుర్లభుం డెవరు?

కష్ట మెందుల కిటు గాంత! యో గిరిజ!
కఠినమౌ వ్రతముల గుంది పోయెదవు!
పూర్వాశ్రమము నందు బూని నే దనము
బ్రోవుచేసిన ఫలము బొందుగా లేదు!
సగభాగ మిచ్చెద సౌభాగ్య గరిమ
నీ కాంక్షితంబును నెఱవేర్చ కొనుము!

ఆ వటుం డెవరోకో! యతనిచే కేమి?
తెలియ గోరెద సఖి! తేటతెల్లముగ

ఆ జటాధారిచే నావిధిం గారి
ప్రశ్నింపబడినదై బహు నాదరమున!
తన మనోరథమును దగ విప్పి జెప్ప!
యత్నించి విఫలమై యూరిన సిగ్గు!
తన పార్శ్వవర్తిని దగ దెల్ప మనుచు
గనుసన్న జేసినది తన మది మాట!

ఆ పార్వతీదేవి యా ప్రియ సఖియు
బ్రహ్మచారిని జూచి బరిగ నిట్లనియె!
ఓసాధు! చెలికాడ! నొప్పుగా వినగ
నా సత్కీయున్నచో నయముగా వినుము!
ఉష్ణ వారణమున నొక్క్వగా గొడుగు
కమలమును జేసిన కథగ మా సఖియ!
తపమును సాధింప తన శరీరము ను
బరికరంబును వోలె బరగ జేసినది!

ఇంద్రాణి మున్నగు చంద్రశేఖినను
మించిపోవంగను మిన్నందు కొనగ!
ఇంద్రాది దివిజుల సాంద్ర దీధితుల
దిక్పాలకుం గూడ ధీరత నోడలి!
మదను జయించిన మహనీయ మూర్తి
రూపాన వశపడక రూపించువాని!
ఆ పరమేశ్వరు నా సదా శివుని
గోరుచున్నది సఖి! కూరిమి బతిగ!

ఆ క్షణమె మేల్కాంచి "హా! నీలకంఠ!
ఎచటి కేగెద!" వంచు వచనముల్ బల్కు!
కలలోని యా శివు గౌగలింపగను
నిదుర మేల్కాని జూచు బెదురు చూపులను!

సర్వవ్యాపకుడవు! సర్వాత్మ ననుచు
బుధులు చే కీర్తించు బూజనీయుడవు!
నిను మదిం దలచు నీ దాననై న
నన్నేల గావవు? నాథ! సర్వేశ!
అనుచు దా వ్రాసిన హరుని చిత్రమును
నేకాంతమున బల్కు నీర్ష్య బెల్లుబుక!

అంతియే గాదు సుమ! సఖి నేను శివుని
బొందగా యత్నించి పోతి చింతించి!
వేరొక మార్గంబు వెదకి గానకను!
తపసు చేయగ బూనె! దరుణి! నిశ్చింత!
తండ్రి యాజ్ఞను బొంది తగ చెలుల్ గూడి
తపసు చేయగవచ్చె తరుణి యీ వనము!

నాటిన వనలతల్ నవకోమలములు
చిగురులు పూవులు చిత్ర చిత్రములు!
ఫలములతో నిండె బన్నగా దరులు!
కాని మా సఖి కోర్కె కిట యట్టులుండె!
పూలు పూయుట లేదు! మొక్కయు లేదు!
ఫలముల వెప్పుడు ఫలియింప గలవో!

ప్రార్థిత దుర్లభ పరమేశు హరుకు
సుంతయు దయలేదు నెంత వేడినను!

తపసుచే దపియించు తరుణి మా సఖిని
జూడగా మది పొంగు జుమ్మలు జుట్టు!
వర్ష లేమిని గుందు వసుధ నింద్రుండు
వర్షము చేలించు నా విధంబునను!
శివుడు మా సఖి నెప్డు జేకొని కరము
లాలించునో గదా! లలిత పుష్పముగ!

పార్వతి మది గాంచు పశుపతి యా చెలియ
సఖియ హృద్గత భావ సారమంతయును!
దాపరికము లేక దర్శనీయముగ
యా వర్ణికిని దెల్పె హర్ష లక్షణము!
ప్రకటింపకుండగ బాలు డిట్లనియె
"ఓ గౌరి! నిజమేన? యొప్పుగా దెలుపు!
నీ చెలి వచనంబు లిందు సత్యములా?
పరిహాస జన్యమో! బరగ విన్పింపు!

అంతట పార్వతి యతి ప్రసన్నముగ
నంజలి ముకుళించి యక్షమాలికను!
ముంజేతి యందున మోదంబు నుంచి
యా యద్రి తనయ యట్లాగ్ని తోడ!
తన భావమును దెల్పె తగ సిగ్గు నొంది
బరిమితాక్షరముల బరగ నిట్లనియె!

విన్న దంతయు నిజము! విప్రవరేణ్యా!
నా చెలి పలుకులు నయముగా నిజము!
ఉన్నత లాభంబు నుచ్చమా పదవి
నొందగా నే దప మొనరించు చుంటి.

ఆ మహాఫలమును కందగా నిట్టి
స్వల్పమౌ తపదీక్ష యుక్తమే గాద!
మనసు కోరికలకు నాటి గతి గలద?
ఎట్టి వాంఛలకును నెగబ్రాకుచుండు!

అంతట నా వర్ణి యలరి యిట్లనియె!
ఆ శివు నెఱుగుము! సతివ! ఓ మాల!
అవమానమును జెంది యతనినే మఱల
గోరుచుంటివి గదా! కోమలీ నీవు!
అట్టి యమంగళు నాచార రహితు
యా భవుం గోరుచు నాసక్తి బలుపు!
నిను బ్రోత్సహింపంగ నే బూనుకోనను!
నిను మెచ్చుకొనజాల నీరజనేత్రి!

చెడ్డ వస్తువునకు చేయి జాచితివి
హరుని వరించితి వందాల బాల!
పెండ్లి కంకణముతో బ్రీతి నీ కరము
శివు డట్లు గ్రహియింప నెంచు శీతను!
వలయాకృతిం బైన వన్నెల ద్రాచు
కరమందు నుండు గద! కల్యాణమందు!
ఎటుల సహించెదు బటు భయంకరము!
కుసుమ కోమలముగా గూర్మి నీ మనసు!

ఓ గౌరి! సుకుమారి! యొప్పుగా వినుము.
నీకు నీవే మది నిజము యోజింపు!
కల హంస చిహ్నాంత కన్నె చీరను
శోణిత బిందుల సాగ గజచర్మ

ములకేళ్లు పొంతన మోహన రాగ
యుక్తాశి గాదేమొ! సఖియు మొకసారి!

సుందర గృహముల సందాలు చిందు
పూవులు బఱచిన భూమిని! నీవు!
లాక్షారసము లందు లాలింప బడిన
పాదము లుంచెను పార్వతీ నీవు!
అట్టి పాదములను నాస్మశానముల
నెముల జరించెను? వశాక్షి! నీవు!
శత్రువు గూడను జెలిమి! యీ పనికి
నంగీకరింపదు నద్రిజా! వినుము!

ఆ త్రిలోచను నక్షు మందుకో గేవు!
ఇంతికంటె నయుక్త మింకేమి గలదు?
హరిచందనాస్పద మగు స్తన ద్వయము
చితి భస్మ రజముల స్నేహముం జేయు!

సంస్కార వంతుల సాటి వారలను
మఱిమొక నగుబాటు మాటను వినుము!
పరిణీతురాలవై పట్టపేనుగును
నూరేగు దానవు నుత్సాహ గరిమ!
ముసలి యెద్దును నెక్కి పాదమున దరుగ
చిఱునవ్వు జిందరా జేరి యీ జనులు!

ఆ పినాకిని బొందు నట్టి యత్నమున
రెండు వస్తువు లిప్పుడు మెండు దుఃఖమును
బొందెను సుమ! నవి చంద్రరేఖయును
నీవు ద్వితీయవు నీరజ నేత్రి!

నిఖిల లోకములకు నేత్ర కౌముదివి!
ఆనందవర్ధని నఖిల లోకములకు!
ఎటుల జేపట్టుదు నింపుగా సతిని!
మాను మీ యత్నంబు మా మాట వినుము!

ఆతని రూపంబు నతి విరూపంబు
పుట్టుపు తెలియదు పూర్వోత్తరములు!
ధనధాన్యములు లేవి దారిద్ర్యమనుచు
దినములు తోడనే దెలియంగ వచ్చు!
వరలక్షణములలో వాసిగా నొకటి
యరసి జూచిన లేదు నా శిశువందు!
ఎటుల జేపట్టుదు నింపుగా సతిని?
మాను మీ యత్నంబు మామాట వినుము!

ఆ యభీప్సితము సతివ! వే విడుము!
నా మహాదేవుని యాశన్ వదలు!
అతివ! నీ వెచ్చట? అట్టివా డెచట?
బంగారు బొమ్మవు! భాగ్యాల గనివి!
సాధుజనంబులు సజ్జనసమితి
కాటిలో గాలిన రొట్టె కేరైరె!
వేదోక్త విధులను వలు మార్గముల
యూపసత్క్రియలను నొనరజేయుదురె?

వటుడిట్లు ప్రతికూల వచనముల్ బల్క
ఆ పార్వతీ దేవి యతి కోపమందె!
వణకె నీ బెదవులు! వంగిన బొమలు!
యరుణిమల్ దాలిచెటి యా కనుదుదలు!

కోపంబు సూచించు గోపన బోలె
మాటాడ బూనను మానముం దాల్చ!

ఎట్టకేలకు పల్కె యిట్టుల గౌరి!
"ఓ వర్ణి! యీ శివు' డోంకారయుతుని!
యాదార్థ్య తత్త్వంబు నరయంగ లేవు!
అందుకే బలికితి వరమిడి తెలివి!
యతిలోక సామాన్య నచిన్త్య హేతు
లగు మహాత్ముల లోక మరయంగ లేదు!
మందబుద్ధులు వారి మది గానలేక
దూషించు చుందురు దూరముగుండి!

ఆపదల్ దూరము నంపగా గోరు
నైశ్వర్య సంపదల్ నందగా దలచు!
జనులు ధరింతురు సహజంబు గాను
గంధ మాల్యాది సుగంధ వస్తువుల!
లోకశరణ్యుండు! లోక రక్షకుడు!
కోరికల్ లేనట్టి కూర్మి చిత్తుండు!
ఈ మంగళములచే నేమి లాభంబు!
ఇట్టి వాంఛల చేత నేమి ఫలంబు?

దారిద్ర్యుడైనను ధరణి సంపదలు
ప్రభు వాతడే గదా! ప్రభవ మొందుటకు!
పితృ భూముల ముందు ప్రేమికుండైన
ముజ్జగంబులకును మూలంబు గాద!
అతి భయంకరుడైన యతి సౌమ్యు డంచు
విదులు గీర్తించెడి వేదవేద్యుండు!

మౌళిపై నున్నట్టి మందారపూల
రజముచే నరుణిమల్ రంజిల్ల జేయు!

ఆ పరమేశ్వరు నఖిలేశు గూర్చి
దూషణంబులు నెన్నో దూరితి విప్రుడ!
పుట్టు పూర్వోత్తరాల్ బోరయ రాదంచు
నొక సాధు భాషిత మొక్కొ బల్కితివి!
ఆత్మేశ్వరునకును యాత్రిడే మూల
మనుచు జెప్పగ నాత నరసెన వెటుల?

ఈ వివాదము జాలు! నింక నో వర్ణి!
ఆ శివు గూర్చి నీ వనిన వాక్యములు!
నిక్కమే యౌగాక! యొకమాట వినుము!
అతికెను నా మది! యా శివునందు!
శృంగార రసమున సింగార మందె!
భావైక రసమున బ్రబలుచున్నదియు!
స్వేచ్ఛా విహారికి సిగ్గొగ్గు గలదె?
తన త్రోవ దా బోవు నినడేరి మాట!

ఓ చెలీ! నిలువుము! నొప్పగా వటుని!
మాటాడ వలదని మర్యాద దెలుపు!
మహితాత్ములను గూర్చి మన్నన లేక
అపభాషణము జేసి యలరెడి వారు!
వారికే కాదుసూ! యొరరు బాపంబు
వినువారు సైతము విధిని బొందుదురు!

ఇటుల గాదేని నే నిటనుండి వేగ
వెడలి పోదును చెలి! వినుము! నా మాట!

అనుచు బల్కుచు లేచె యా శైల తనయ
అలరి పై నున్నట్టి యంశుకము జార!
వృషభధ్వజుండును వే నగపుత్రి
చిఱునవ్వుతో నిల్చె జి ్వలాసముగ!

నిజరూపమును బొంది నిలిచిన శివుని!
పార్వతి వీక్షించి పరవశం బంది!
గలిగిన స్వేదంబు గంపంబు గదుర
నెటు బోవ జాలక నీశుని యెదుట!
ప్రవహించు వాహిని బన్నుగా నెదుట
కొండడ్డు వచ్చిన గూడిన సుడుల
తొట్రిల్లు చందంబు దూగి యా గిరిజ
యటు బోక యిటు బోక యచటనే యుండె!

అంతట పురహరుం డా సదాశివుడు
అవనత దేహయా యా గిరిపుత్రి!
"నీ మహా తపముచే నీ భక్తి చేత
నీకు నే వశుడను నీ జనేత్రి!"
అని పల్క నీశుండు నా శైల తనయ!
గత క్లేశమును విడి కలకిల విరిసె!
క్లేశము ఫలముచే ఖిన్నత్వ మొంది
నవ నవోన్మేషంబు నర్తించు గాజ!

(పంచమాశ్వాసము సమాప్తము)



# శ్రీ గిరిజా కళ్యాణము

## షష్ఠాశ్వాసము

[పార్వతీదేవి తపము ఫలించుట]

అంతట నా దేవి యా శైల తనయ!
యా మహాదేవుని యనుగ్రహా మంది!
అట్టి విశ్వాత్మకు నా మహాశివుకు
సఖియచే బలికించె సత్ప్రతిమీరగ
తన దండ్రి హిమవంతు ధన్యగా జేసి
దాతగా గ్రహియించి ధర్మయుక్తముగ
స్వీకరింపు మటంచు స్వీయ ప్రార్థనను!
జెలిచేత బలికించె జెంతనే యుండి!

అటు సఖీ ముఖమున యటులు బలికించి!
యా ప్రియు విషయాన నందె నిశ్చింత!
మధు వసంతమునందు మాధుర్య మొలుకు
నాదు కోయిలజేత నందాలు జిందు!
మావికొమ్మకు వోలె మధురిమల్ జిందు
చెలిచెంత నిలుచుండె జిలువగపు తోడ!

ఆ స్మర శాసనుం డా త్రిలోచనుడు!
'అటులనే!' యని బల్కె యా శైల తనయ!
కమనీయ స్నేహంబు గాఢానురాగ
మెటులనో యొదుగుచు నీప్సితం బొంద!
జ్యోతి స్వరూపులు ప్రీతిపాత్రులును!
సప్తర్షి గణమును స్మరియించె శివుడు!

ఆ హరుం డిటు బిల్వ నా తపోధనులు!
తమ కాంతులను బింగి తమ ప్రకాశముతో!
ఆ వసిష్ఠుని కాంత యా యరుంధతితో
హరుని ముందున కొచ్చి యగుపించిరపుడు!

ఆకాశ గంగకు నటునిటు మాన్చ
మందార తరువుల మధుర పుష్పముల!
విరజిమ్మ నలలతో నింపులొప్పారు
ఽజ్వాగములు మన్ని దేజరిల్లుచును!
మదగంధముల జేత మాధుర్య మొలుకు
నా నీరముల మున్గు నా దేవ మునులు
హరుడు భావమునందు నలరి బిల్చుటను
హరుని ముందున కొచ్చి యగుపించి రపుడు!

ముత్యాల జందెముల్ మెదమున దాల్చి
హేమ వల్కలముల నిండుగా గట్టి!
రత్నాక్ష మాలికల్ రంజిల్ల బట్టి
వానప్రస్థము నందు వేనొప్ప నుండి
కల్పవృక్షములుగా కల్యాణప్రదులు
హరుని ముందున కొచ్చి యగుపించి రపుడు!

సప్తర్షి మండల సరినత దిగువ
సూర్య మండలమున సూటిగా రవియు!
తన రథ కేతనాల్ దగులునో యనుచు
క్రిందికి దింపుచు నంద దీవెనలు!
యుత్సాహముమండునా! నట్టి యా ఋషులు
హరుని ముందున కొచ్చి యగుపించి రపుడు!

ప్రళయంబు నందున బ్రహ్మాధి వోలె
నా మహావిష్ణువు నా క్షణమందు!
ఆది వరాహంబు నవతార మెత్తి
భూదేవి రక్షించె బోలుపుగా దంష్ట్రి
ఆ సప్త ఋషులను నటులె గోరలను!
గరుణతో రక్షించె గారుణ్యమయుడు!
ఆ చిరంజీవులు నట్టి శాశ్వతులు
వారుని ముందున కొచ్చి యగుపించి రపుడు!

శేషసృష్టిని జేసి చిరయశ మంది
బ్రహ్మ యంతటి వారు బ్రహ్మ లటంచు
ప్రాచీన విదులచే బ్రస్తుతి గనిన
యట్టి తపోధనుల్ నా మహితాత్ము
లా వసిష్ఠుని కాంత యా యరుంధతితో
హారుని ముందున కొచ్చి యగుపించి రపుడు!

గతజన్మ క్రియలచే గాఢమౌ దపము
నిర్మల పరిపాక కర్మలకు ఫలము!
అనుభవించుచు గూడ యట్టి కర్మలను
మఱల జేయుచు నుండు మహనీయులైన!
అట్టి పుణ్యాత్ములు నట్టి నిస్పృహులు
హారుని ముందున కొచ్చి యగుపించి రపుడు!

సప్తగుణకు మధ్య సంధ్యగా తోణుకు
నా వశిష్ఠుని భార్య యా పతివ్రతము!
పతిపాదముల దృష్టి బరగ నిల్పుచును!
నా యరుంధతి వచ్చె నలరి వారలతో!

మహనీయ దశముల మూడు రూపముగ
ప్రత్యక్ష దేవిగా బరగుచు నుండె!

ఆ మహాదేవుండు నా పరమ శివుడు
మునులను వీక్షించి మోదంబు నందె!
ఆ మహా ఘనులను నా యరుంధతిని
సమదృష్టి దోడుత సరసత జూచె!
స్త్రీలు బుద్ధు లటంచు చిత్తంబు నందు
భేద భావము తోడ వాదింప బోరు!
సాధు సత్పురుషుల సరసమగు దృష్టి
ఘనతరంబుగ నుండు గమనీయ గతుల!

ఆ యరుంధతి గాంచి యా త్రిలోచనుడు
భార్యయం దాసక్తి బహుతరం బాయె!
ధర్మ కార్యములను తగ నాచరింప
పతివ్రతలగు సతుల్ బహు సహాయినులు!

ఆ పరమేశ్వరుం డా జగద్గురుడు!
ధర్మాచరణమున తనమునె యుండు
పార్వతీ దేవికి ప్రణయ భావమున
స్థానము కల్పింప సంతసం బందె!
మరి జీవింతునని మదనుండు దలచి
యూరట నొందెను సచ్ఛ్యాగమునను!
పూర్వాపరాధముం బొందిన భీతి
గలిగిన కలతను క్రమముగా విడిచె!

సాంగము వేదముల్ జదివిన యట్టి
యా మహాత్ములంత సవధులు లేని!

నీ గౌరవము చేత నిఖిల లోకేశ!
మా యాత్మలను మేము మర్యాదలొప్ప!
గౌరవంబున జూచి గర్వమది లేక
బొంగుచు నున్నాము భూతేశ విభుము!
ఉత్తముల్ గీర్తింప నొప్పు నాదరణ
తమ గుణముల యందు దగిన విశ్వాస!
సదయమందును గదా యుర్వి జీవులకు!
సత్కృతులైతిమి! సౌభాగ్య గరిమ!

ఓ శివ! పరమేశ! ఓ విశ్వరూప!
స్మరియింపగా నీవు జనియించి నట్టి!
ప్రీతి సంతసములు ప్రేమ పుల్కలను
నీకు దెల్పుము స్వామి! నిండారు మదిని!
అంతరాత్మవు నీవు! నఖిల జీవులకు!
మా హృదభావముల్ మర్మముల్ దెలియు!
అందుకే దెల్పము! నాత్మేశ! నీకు!
తెలిసిన విషయముల్ దెల్పంగ నేల?

కనులకు నిజముగా గానబడుచున్న!
కాని నిన్నెఱుగము కల్యాణరూప!
బుద్ధి యాలోచన బోధకున్ రావు!
ఆత్మరూపము దెల్ప మాదరంబువను!

నీతత్త్వ రూపంబు నిఖిల మాటుచు
కనబడుచున్న యీ కమనీయ మూర్తి!
సృష్టి సంహారం స్థితి చిత్రములందు
నే చిత్రమో మాకు నింపుగా జూపు!

హర హరి బ్రహ్మల యుముల రూపముల
ఏ రూపమో మాకు నింపుగా దెలుపు!

ఓ సకల లోకేశ! ఓ మహా దేవ!
నిజరూప మిది యని రూఢిగా దెలుప!
ఆదిశేషునికైన యలవియే గాదు!
అడిగిన యాప్రశ్న యటులుండనిమ్ము!
తలపగా వచ్చిన తపసుల మయ్య!
ఆజ్ఞ సేయుమ వేగ నాచరింపగను!

అంతట నా భవ్యం శంకరి యా ఋషుల
మౌళిగత జంద్రుని మంద్రకాంతులను!
దంతరుచి కాంతుల దగ స్నిగ్ధబఱచి
బ్రత్యుత్తరం బిచ్చె బ్రవిమల భాష!

మునులార! ఘనులార! వినుడు నా మాట!
నే జేయు బహుళన్ని నేర్పుతో జూడ!
స్నిగ్ధముల్ గాంచు సంసత దెలియు!
వివరింప బనియేమి నిట్టి సంగతుల?
అష్టమూర్తు తోడ నైతి నీ మూర్తి
ననుచు సూచించితి యబ్బురం బేల?

దాహాన దపియించి దైన్యంబుతోడ
వర్ష ధారలకునై వరుణుని కోఱకు
చాతకంబుల మాడ్కి సరసత నేను!
యాచింప బడితిని యా దేవతలను!
సంతానమును నేను సరగున బొంద
రక్కసు బాధల రయమునం బాయ!

అందుచే నే నిపు డా సురల్ జేయు
ప్రార్థన మన్నించి బరగ రక్షింప!
సంతాన ప్రాప్తికై సత్పుత్రు బడయ
యజ్ఞము జేయంగ యత్నించు ద్విజుడు!
అగ్ని నుత్పాదింప యరణిని యరసి
సంగ్రహించెడి రీతి సరగున నేను!
వీరుని ధీరుని విప్రమోపేతు!
బొందగా పార్వతి నంద గోరెదను!

అందుచే మీ రిపు డరిగి హిమవంతు
గన్య నిమ్మంచును గడగుడు యడుగ!
ఎందుకు? నేలన? యిట్టి మీవంటి
సజ్జనుల్ గూర్చిన సంగతు లెప్పుడు!
విఘటనములు గావు వికృతి గాదు!
గావున నిప్పుడు గడగుడీ పనికి!

దివిజుల రక్షింప దేవ కార్యమున
యుపకారమును జేయ నుద్యుక్తు నైతి!
ఉన్నతుండును స్థిరుం డుత్తముం డైన
భువన వాహకుడైన భూరి బలుడైన
యా హిమవంతుచే నీరు సంబంధ
మతి యుత్తమంబని యాత్మను దలచి!
ఈ శుభ కార్యంబు నింపుగా జేయ!
దగుదురు మీరని దలచితి మిమ్ము!

ఆ పర్వతేశ్వరు నా హిమవంతు
గన్యను నడుగంగ గాంక్షతో నిటుల!

బలుకఁగా జెప్పంగ బనియును లేదు!
సాధు సజ్జనులగు దాపసులు మీరు!
మీ చేతనే గదా మేదిని మీఁది
యాచార పద్ధతుల్ సరి బెంపొందె!

అతి పూజ్యురాలైన సతి యరుంధతియు
ఇట్టి కార్యము లందు నెంతయో నేర్పు!
చతురత జూపును సాయంబు గొనుడు!
సాధారణములైన సరసమౌ నిట్టి
గృహకార్యములయందు గృహిణులే కాద!
ప్రౌఢిమ దక్షత బరగ జూపుదురు!

కావున ఋషులార కదలుడు వేగ!
హిమవత్పురంబున హిమవంతు కడకు!
ఏగి తద్విషయంబు నింపుగా దెలిపి
కార్యసిద్ధిని బొంది కడు వేగ రండు!
ఎదురు జూచుచునుందు నీ మహా కోర్కి
నదియొడ్డు గలియుడు నయముగా నన్న!

అని యిటు బలుకంగ నా మహాశివుడు!
యోగులలో నాద్య యోగివర్యుండు!
విన యా పరమేశు డటు వివాహంబు
నొందగా జూపెడి చందము జూచి!
భార్య లున్నందుకు బహు లజ్జ నొదిలి
సప్తర్షి గణము దా సంతోష మొందె!
'అటులనే!' 'మంచి'దం చా మహాఋషులు
శివునాజ్ఞ గైకొని శీఘ్రంబు జనిరి!

ఆ మహాశివుడును నటనుండి కదలి
తాను జెప్పిన బ్రాహ్మణగు స్థానంబునకు
మునులను గలియంగ ముదమున దాను
కాశీ నదియొద్దు కూరిమి నుండె!

ఆ బ్రహ్మ పుత్రులు నా యోగి వరులు
పరమ హర్షముతోడ బటు మనోగమన!
మాకాశమున జేరి యా హిమనగరి
యోషధీప్రస్థమున నొప్పుగా దిగిరి!

వసు సంపదలకును వాలాయమైన
యలకాపురిని దెచ్చి యట నిల్పినట్లు!
స్వర్గాతిరిక్తమా జనముల నిలుప
నాకని జేశిరి మట్లు నుండెనో యనగ!
ఆ యోషధీపురం బతి మనోహరము!
ఆ పురంబున కేగి రా మహామునులు!

ప్రవహించు గంగ యట బరుగులం దీరను
ప్రాకారముల మధ్య బరగ యోషధులు!
రత్నాల గోడలు రాజిల్లు చుండు!
ప్రాకారముల జూడ బహు జక్కదనము!
ఆ యోషధీపురం బతి మనోహరము!
ఆ పురంబున కేగి రా మహామునులు!

అచటి యేనుంగులు నచటి సింహముల
భయములు లేకను ప్రబలుచు నుండు!
అచటి యశ్వంబులు సందాలు చిందు
వానికి యవి సాటి వర్ణింప దరమె?

యక్షులు కింపురుషు లచటుండు జనులు
వనదేవతలు స్త్రీలు నొప్పగా నచట !
ఆ యోషధీపురం బతి మనోహరము !
ఆ పురంబున కేగి రా మహామునులు !

మేఘాలవఱకును మెఱయు మేడలును !
మేడల ధ్వనియించు మేలైన ధ్వనులు !
ఆ ధ్వనులనిపించు నంబరవీధి
మబ్బులో యురుములని మది భ్రమ మునుగు
అరసి జూడగ వాని హస్తతాడనల
మురజ స్వనాలని ముద్దుగా దోచు !
ఆ యోషధీ పుర మతి మనోహరము !
ఆ పురంబున కేగి రా మహామునులు !

అచటి కల్పద్రుమము లతి సుందరములు
కదిలెడి శాఖల కనకంబు మణులు !
పీతాంబరంబుల ప్రబిముగా దాల్చి !
యాచకులకు నివ్వ యారాటపడును !
అట్టి కొమ్మల నుండు నా పత్రకోశులు !
ఎత్తైన జెండాల నింపులు జిందు !
అట్టి యోషధిపురం బతి మనోహరము !
ఆ పురంబున కేగి రా సప్తఋషులు !

స్ఫటిక హర్మ్యములందు పానభూములను
సచిత్ర మాలల రమ్య రూపములు !
ముత్యాల హారాల ముద్దుగ నొలుకు
పూలదండల వలె బొలుపుల జిందు !

అట్టి యోషధిపురంబతి మనోహారము!
ఆ పురంబున కేగి రా మహామునులు!

నల్లని మబ్బులు నలుదిశ లందు
గ్రమ్మి యప్పటికిని గమనీయమైన!
ఓషధుల్ జ్యోతులై యొప్పారుచుండ
పయనించుచుందురు పరవశ మంద!
అభిసారికలు దమ యానాల ప్రియుల
యంకాల జేరుదు రానంద మొప్ప!
గావరు! కద! దారి కటిక జీకటుల!
అట్టి పురమున కేగి రా మహామునులు!

వయసు మాద్దేదంచు వరుస బ్రశ్నింప
యౌవనమే మద్దు! అని జెప్పవచ్చు!
అంతకు దేవదన్న యరసి ప్రశ్నింప
ఆ పుష్ప బాణుడే! యని దెప్పవచ్చు!
దీర్ఘ నిద్రలట దీర్ఘచూడవుగా!
రతిఖేద ముత్పన్న రమ్య నిద్రయే!
సుఖము ఆనందము, సుందరత్వములె
విస్మృతు లటలేవు వేదనల్ లేవు!
అట్టి యోషధిపురం బతి మనోహారము
ఆ పురంబున కేగి రా మహామునులు!

కోపించు వారట గోరినం లేరు!
యాచించు వారట నరయగా రారు!
కనిపింతు కాని యట గమనీయ గతుల
ప్రేయసీ ప్రియులట ప్రేమలీలలను!

కోపింత్రు యాదింత్రు గూడి ప్రేమమును
రాగాల భావాల దివ్య లీలను!
అట్టి యోషధిహరం బతి మనోహరము
ఆ పురంబున కేగి రా సప్తఋషులు!

ఆ పురి వెలుపల నతి రమ్యమైన
గంధమాదనమను గల దొక్క కొండ!
ఉద్యానవనము గల దూహింపరాని
కల్పతరు ఛాయల గంధర్వులచట!
నిదురించు చుందురు నిర్మల సుఖము
సకల సుగంధముల్ సరసపుష్పములను!
విలసిల్లు దరులందు వేనకు వేలు!
ఆ పురంబున కేగి రా సప్తఋషులు!

ఆ దివ్యమును లంత నా హైమపురము
అంద చందంబుల నలరు సౌఖ్యములను!
చూడ స్వర్గముకంటె జోద్యమౌనం చలరి
యందుండి మునులకు నభిమతం బొదవె!

చిత్తర్వులో నున్న చిత్రంబు బగిది
అగ్నిహోత్రములుగా నలరు నా మునులు!
జటలతో గూడిన జ్వాజ్వల్యమాన
ద్వారపాలకు లంత తేలు బైకెత్రి!
చూడగా జోద్యము సురమును లంత
హిమవంతు సద్మమున నింపుగా దిగిరి!

ఆకాశ మందున యా మహామునులు
వృద్ధాను రూపము నొప్పగా జనుట!

నీటిలో దోలుకాడు నీరజమిత్ర
గమి వోలె నందిరి కమనీయ శోభ!

ఆ ముని సంఘంబు నరసి గిరిమాళి
పూజింప నర్చింప బోలవుగా మునుల!
అర్ఘ్య పాద్యములను విరియు బూవులను!
గైకొని యెదురేగె కాంతతో గూడ!
బరువైన పాదాల బరువుశో తోణికి
భూమాత ఫుల్కల బొల్పులం జింద!

గైరికంబు లనేటి గను యొత్తు బెనవు
లున్నతమైనట్టి యురు శరీరమున!
దేవదారువులను దిశలను సాగు
బాహువుల్ తోడుత బరగ శిలవంటి!
వక్షస్థలము తోడ వాలాయముగను
హిమవంతు డని దోచు నెవ్వారి కైన

అంత నా గిరిరాజు నామహామునుల
అర్ఘ్యపాద్యములచే నలరి బూజించి!
పరము పూత పవిత్ర బ్రహ్మపుత్రులను
దారి జూపుచు ముందు దరిగొని నడిచి!
శుద్ధాంత పురమున శోభిల్ల మునుల
దోకొని పోయెగా దుఃకింప భక్తి!
భూధరేశ్వరుడంత బొలుపుగా ఋషుల
శ్రేత్రాసనము లందు విపుల దర్భలన!
ఆసీనులను జేసి యశదును గూడె!
శుచి తాసనము నందు నొప్పుగా నుండి!

అంజలి తోడుత నభివందనముల
నిటుల దా పలికెను నింపుగా నతడు!

మేఘోదయము లేని మేల్మి వర్షముగ
బూవులు లేకుండ బొడమిన ఫలము!
రీతిగా నున్నది యతి చిత్రగతిని
యూహింప బనిని మీ యొసగు దర్శనము!
అతులిత లాభమై యలరారగలదు!
నే ధన్యుడైతిని నిండు భాగ్యముల

మీ యనుగ్రహమున మీ నిండు దయను
అజ్ఞానినైన నే నధికునైనట్లు!
ఇనుముగా నున్న నే హేమమైనట్లు!
భువినుండి పైకెగసి దివినుండినట్లు!
మీ దర్శనమునందు మిగుల హర్షమున
భావించుచున్నాను బరగ నాయాత్మ!

ఈనాటి నుండి నే నింక నీ భువిని
పరమ పవిత్రుగా బరగి వర్తిలుదు!
అఖిల జీవులకును నాత్మోపలబ్ధి
బొందగా ఫలితముల నందింపువాడ!
తమవంటి వారెట దగ వసించుదురో!
అదె పవిత్రక్షేత్ర మందురు గాద!

ఓ మహా ద్విజులార యొప్పుగా వినుడు!
తలమీద గంగవడి తగ ప్రవహింప!
పావనంబైన మీ పాదోదకముల
నీ రెంటిచే నేను నిల పవిత్రుడను!

పరిశుద్ధు నని మది భావన జేసి
ఆనందమును బొంది యలరారు చుంటి!

ఓ తపోధనులార! ఓ ఋషులార!
స్థావర జంగము సరస దేహంబు!
ద్వివిధ రూపంబైన సేవల వలన
ధన్యాంశ నైతిని! దగ మీకు కృపను!
పాపవినాశనమును, బసిగొను చేత!
రెండు విధముల దయను మెండు బొందితిని!

భవ్య తేజస్సులో బరగ మీ కృపను
దయను మిన్నియు మాసె విమలుండ నైతి!
రాజస మొక్కటి రాజిల్ల నేమి?
కటిక చీకటి మని కమనీ యము యెన్న!
సూర్య దర్శనమున సురుచిరం బైన
కాంతులు వెల్గుచు గలిగె సంతసము!

దిక్కుల తుది దాక దీర్ఘమై యున్న
అవయవంబుల తోడ నలరారుచున్న!
మీ యనుగ్రహమున మీ రాక వలన
గలుగు సంతసమును నిలువరింపగను!
ఈ నా శరీరము నీయుంగములును
జాలవు నటించె నరసత మీర!

నిస్పృహులరు మీరు నిర్జితేంద్రియులు!
నే జేయు పని మీకు నిజముగా లేదు!
పనియున్నచో నది ప్రభవించు వేగ
విన్నవింపుడు దయను వేగ జేయుదును!

మీ రాక వలనను మీ దర్శనమున!
నను బవిత్రుని జేయ నని మది దలతు!

కోర్కె లేకున్నను గూడిన మదిని
ఒకపని జేయుంగ నొప్పగా మీరు!
ఆజ్ఞాపనము జేసి యాదరించియును
నను ధన్యు జేయుడు నాదు ప్రార్థనను!
సేవకు లెసేవించు వారిపుడును
యాజ్ఞల దయనుగా యలరి భావింతు!

ఓ మహాఋషులార! ఓ మహా మునులు!
ఈ సేవకుం డిదె! యిదిగో! నా భార్య!
కుల జీవితం బైన కొమరిత యిదిగో!
యెవరిచే సేపని వివరింపు డయ్య!
మణులు బంగారము మాణిక్యములును
బాహ్య వస్తువులను బనిలేదు జెప్ప!

ఇటుల నా మునులకు నా గిరిరాజు
బలికిన బలుకులు బరగ గుహలందు!
ప్రతిశబ్దములజేత ప్రతిధ్వని జేసె!
మరల బల్కిన యల్లె మ్రోగె ధ్వనుల!

అంతట యా ఋషులు సరి సంతసము
కావ్య పురాణముల్ కమ్మని కథలు!
విప్పి జెప్పుటయును విఖ్యాతు లైన
యా యోగిసు బల్కె నాదేశ మొసగ!
అతడును హిమవంతు నాదరం బొంగ
నిటుల బల్కె దొడంగె జటులోక్తి తోడ!

నీవు జెప్పిన దంత నిజముగా సత్య
మింతికంటెను గూడ నీగల వధిక!
శిఖరంబులకు వోలె జిద్విలాసంబు
నున్నతంబే కా దుదారంబు గూడ!

స్థావరాత్మకు నిన్ను సర్వవ్యాపకుడు!
విష్ణుతో బోల్తురు విమల జ్ఞానమున!
అతుల బెద్దలు జెప్ప సత్యమే యగును!
సకల చరాచర సర్వ జీవులకు
స్థావర జంగమ సకల భూతముల
కునికిబట్టువు గదా! యుదరంబు నీవు!

ఆ రసాతల మూల మందున నుండి
యవనిని మోసెడి యతిథు వీవె!
అతుల నీ వా భూమి యటు మోయకున్న
తామర తూడ్లతో తెగ మృదువైన!
పడగల శేషుండు భరియించు నెట్లు?
భూభారకుడ వీవు భూరి బల తేజ!

అలలతో తెరలతో నందాలు జిందు
నదులెన్నొ నీనుండి కదులు నంబుధికి!
పరిశుద్ధములు నైన పావనంబైన
కీర్తి పతాకముల్ వర్తిల్లి జగము!
పుణ్యసంతులు జేయు భూప్రజనెల్ల!
సారవంతములగు సకల భూములను!

ఆ మహా విష్ణువు నలరు పాదము!
ప్రభవ మొందగ గంగ ప్రజలచే జగతి!

శ్లాఘింప బడినదో సరసమౌ రీతి!
మఱల రెండవసారి దాటిలి నీ శిరము!
మహనీయ పుణ్యాత మాన్యతి నొందె
దివిగంగ దిగివచ్చె భువికి నీ చేత!

అడ్డముం గ్రిందికిం బరయ మీదికిని
వ్యాపకత్వము నొందె వర్ధింగ విష్ణు!
హరి త్రివిక్రమునిగా యలరె యానాడు
బలిని వంచించుటకు బరగ నైకొనెయొ!
నీ కన్న నో నిది సత్య శాశ్వతము
స్వాభావికంబును సర్వ సిద్ధమును!

యజ్ఞ యాగములందు యజ్ఞ భోక్తవుగ
స్థానముం గైకొన్న సత్పాత్రి వీవు!
ఇట్టి గౌరవమిది యింపుగా మేరు
బంగారు శిఖరంబు బహు మాన్యతలను!
వ్యర్థంబుగా జేసి వాసి కెక్కితివి!
పర్వత రాజుగా ప్రఖ్యాతి నిలిచె!

కాఠిన్య మంతయు కఠినమౌ శిలల
దాచిపెట్టిన యట్టి ధర్మవీరుడవు!
సాధు సత్పురుషుల సదయుల నొందు
భక్తి పాత్రుడ వీవు! రక్తి శీలుడవు!

ఆగమనంబును నడిగితి విపుడు
వినుము! నా కార్యంబు వివరీకరింతు!
కార్య నిర్వహణంబు కథ యంత నీది
ఉపదేశముల వల్ల యున్నతసంబైన

కల్యాణ బోధల కాకల కనిని
నొక యాశ మగుదాము నొప్పగా మేము!

అణిమాది గుణములు గలిగిన వాడు
నితర దేవతలను నితర పూరుషు!
పొంద శక్యముగాని బొలువారు నట్టి
యీశ్వర శబ్దంబు నిలదాల్చు వాడు!
బాలచంద్రుని దల భరియించు వాడు
అట్టి వాడెవరన యా మహా శివుడు!

ఈ మహా విశ్వంబు నీ మహాకృతిన్!
జగతి రథంబును, చైతన్య రీతి!
అష్ట మూర్తులు నను యష్టాశ్వములను
నడిపించువాడెవడో! నవశక్తి తోడ!
బాలచంద్రుని దల ధరియించు వాడు!
అట్టి వాడెవరన నా మహాశివుడు!

ఆధ్యాత్మ వేత్తలు యెలరి దేహమున
యున్నట్టి వానిని యూహను వెదకి
విద్వాంసు లెవ్వని వినుల నదనంద
జన్మరహితంబని జాటి చెప్పుదురో!
బాలచంద్రుని దల ధరియించు వాడు
అట్టి వాడెవరన నా మహాశివుడు!

సకల లోకంబులకు సాక్షి భూతుండు
అడిగిన వరముల నంపించు వాడు!
మా నోట తన గోర్కె మాధురిం బలుక
యుంపినాడిదె మమ్ము నా మహేశ్వరుడు

నీకూతు పార్వతిని నిజ సతింగాగ
యాచించుచున్నాడు నఖిల భూతిపతి!

ఉత్తమ పలుకునకు సత్తమార్థముగ
నీకూతు శివునకు నీవు నర్పింపు!
అర్హమౌ గావున నతనికి నిమ్మా!
జగతిలో దండ్రులు సామాన్యముగను!
సర్వార్థ కీలక సత్పాత్రి గూర్చి
శోకంబు గూర్పదు శోభలం గూర్చు!

స్థావర జంగమ సకల భూతములు!
తల్లిగా నీ కూతు దగ భక్తి భావ!
ముతోడ నంజలుల బూజింపగలరు!
ఆతండు దండ్రిగద! యఖిల జీవులకు
శివరాణి యైనచో సృష్టి సర్వమును
తల్లిగా భావింత్రు దంగని భక్తి!

ఇంద్రాది దేవతల్ నింపుగా మునులు
ఆ చంద్ర మౌళికి నతిభక్తి, మొక్కి!
పార్వతి చరణముల్ బ్రణమిల్లి రక్తి!
గౌరవింతురు గాత! కలకాలములును!

ఉమ పెండ్లి కూతుగా! నొప్పంగా నీవు!
దాతవు! యాచించు బాత్రులు మేము!
ఆ మహా శివునకు నందమౌ వరుడు!
నిది చాలు! నీ కుల మింపు బెంపొందు!
అతిశయించును కీర్తి యఖిల లోకములు!
ఏమి నీ భాగ్యంబు! నెట్టి సత్కీర్తి!

సకల లోకములచే సంస్తుతు లందు
సర్వలోకములకు సాక్షి భూతుండ!
ఆ మహాదేవున కా లోక గురున
కగుము గురుండవు నతిశయంబుగను!
కూతు నిచ్చుటచేత గూర్మి దాతవునై
శాశ్వత సత్కీర్తి సముకూరు గాత!

ఆ దేవ ముని యట్లు నలరి బల్కగను!
తండ్రి ప్రక్కన నిల్చి తరుణి యా గిరిజ!
సిగ్గుచే దలవంచి సింగార మొలుక!
కమలపత్రములను గణుతింప సాగె!

ఆ యోగివరు బల్కు నా గిరి రాజు
మదిలోని దనకోర్కె మమత సిద్ధింప!
సంతోష మొందెను సతియు మేన మరసె!
సుచరితమా సుత్రర్వ నోంచగా గౌరి!
కన్యల విషయమై కాంతల నడిగి
యొనరింత్రు గద పనుల్ నొప్పుగా జగతి!

ఆ మహాపతివ్రత యా మేనకయును
భర్త యభీష్టంబు బరగ దానెఱిగి!
అట్టి కార్యంబును నలరి జేయగను!
తన యభీష్టము దెల్పె! తగ్గె యా మేన!
పతివ్రతలగు స్త్రీలు భర్తృ కాంక్షను
ననుసరింతురు గాని యుద్దు నిర్వారుగా!

అంతట హిమవంతు డా మహర్షికి
బ్రత్యుత్తరం బీయ బరగంగ దలచి!

మంగళాలంకృత సుహిత తనవృత్తి!
కరముల గ్రహియించె గమనీయ శోభ!

అంతట గిరిరాజు సుతరి బాత్రిను
'రమ్మా బిడ్డా! రమ్మా! రాగాల కూన!
నీ మది గోరిక నెఱవేరెనమ్మా!
బిక్షగా నర్పింతు! బ్రీతిగా భవునా!
అర్థించు వారదె! యీ మహా మునులు!
నిచ్చువాడను నేను నిండుగా శివునకు!
నిన్ను గన్నందుకు నీ వల్ల నేడు
గృహమేధి ఫలమును కీర్తి బొందితిని!

అని బల్కి తన గూతు నర్థితో మునుల
నంజలి ఘటియించి యర్థి పిల్చెనో!
ఇదె! ఇదె! శివరాణి! సంపుగా మీకు
నందనంబుల జేయు వధువును గనుడు!

అంతట నా మునులు నా మహీధరుని
మాటల నగ్గలె మది సంతసించి!
ఆనంద వాహిని యందు దేలుచును
ఆశీస్సు లొసగిరి యాయుమ కపుడు!

ఆ లోక కల్యాణి యా ఋషుల కపుడు
ఆదర ప్రణామముల్ సలుపుచు నుండ!
బంగారు కమ్మల శృంగార మొప్ప
సిగ్గుచే తడబడు జవ్వారి యపుడు!
ఆ వశిష్ఠుని భార్య యా యరుంధతియు
అంకమున గైకొని ముందాలు జిందె!

కూతుసందలి ప్రేమ కోటి వెల్లువలై
యుప్పొంగు మనమును ముఖమై వెలుగంగ
ఆ యరుంధతి దేవి యరిగి యోదార్చి
సవతులు లేనట్టి సౌఖ్య జీవితము!
నీకూతు కబ్బును నీ యల్లుడనుడు
మృత్యుంజయుండును సత్యు సత్తముండు
లోకములు పాలించు లోకేశు డతడు
యని చెప్పి యోదార్చె నా గిరి పతిని!
అంతట హిమవంతు డా జటాధరుల
బెండ్లి ముహూర్తము ప్రీతితో నడుగ
నాలవ దినమున నయముగా బెండ్లి!
యనుచు బలుకుచు వెడలి రా సప్త ఋషులు!
ఆ హిమవంతుని యాజ్ఞ గైకొంచు!
యటునుండి వెడలిరి యా శివుని కడకు!
కార్యసిద్ధి యాయెంచు కల్యాణ మనుచు
బలికిరి శివునితో ప్రార్థన తోడ!
అటుమీద బరమేశు నాజ్ఞ గైకొనుచు
నాకాశమునకు వేగ నరిగిరి ఋషులు!
అంతట బశుపతి యా మూడు దినము
లతి కష్టమున గడిపె యా శైల పుత్రి!
ప్రేమచె మనసంత కమిలిన రీతి!
ఏ కారణముచేత నిట్టి వారలును
శృంగార భావములు బొంగి యిట్లయిన!
సామాన్య మానవుల సంగతెట్లుండు?

షష్ఠాశ్వాసము సమాప్తము

# శ్రీ గిరిజా కళ్యాణము

## సప్తమాశ్వాసము

### పార్వతీదేవి పరిణయము

అంతట గిరిరాజు నా మహీధరుడు
శుక్ల పక్షమునందు సుందరంబైన!
జామిత్ర శుద్ధికల సరసలగ్నమున
సుత పెండ్లి జేయగ శుభముహూర్తమున!
బంధుమిత్రులతోడ బరిజను లలర
పాణిగ్రహణ దీక్ష బరగ గైకొనె!

ఆ గిరి రాజునం దభిమాన వశత
యాగిరి పుత్రియం దనురాగమునను!
ఆపురి యందున నఖిల స్త్రీ జనము
పెండ్లి కార్యము లందు ప్రీతి బాల్గొనిరి!
అంతఃపుర బును నఖిల పురంబు
నొక్కటై పోయెగా జక్కటి బనుల!

మందార కుసుమాలు నందాలు చిందు!
జల్లిన మార్గాలు సౌందర్య గరిమ!
కట్టిన జెండాలు బట్టు వస్త్రముల
రంగురంగుల తోడ రమణీయ రుచుల!
కనకతోరణముల కాంతులు వెలయ
నాపురి యప్పుడొప్పె నదె స్వర్గమనగ!

ఆ హిమవంతుని కా మేనకకును
నెందఱో పుత్రులు నెంమి యుండియును

పాణిగ్రహణవేళ బరిణయ వేళ
యాసన్నమగు నంత నా దంపతులకు
పార్వతిపై ప్రేమ పందిళ్ళు వేసె
ఉచ్ఛ్వాస నిశ్వాస లొవ్వగా నయ్యె!
చిరకాలమున గన్న స్నేహితు నట్లు
మఱల జీవించిన మమత నుప్పొంగు
ఒక క్షణ మైనను ఎడలి యుండరుగా!
ఒక నిముసంబైన యోర్వజాలరుగా!

ఆ హిమవంతుని యాత్మబంధువులు
వేలుగా నున్నను వేడుకం గిరిజ!
నెత్తుక దింపరు హత్తుకొని హృదిని
ముద్దులు సేతురు మురిపెంబు మీర!
నగమీద నగదొడ్డి నయగారమునను
ఆశీస్సు లిత్తురు నమృత వాక్కులను!

ఉదయ ముహూర్తంబు నొప్పగా మిత్రు
డధిదేవతగనుండు యా శుభవేళ!
శశిలాంఛనుని గూడి చంద్రికల్ వెలుగు
ఉత్తరా నక్షత్ర మొప్ప దినమందు!
పతివ్రత వతులంత బంధుస్త్రీ లంత
పేరటాండ్రందఱు బేరిమి గూడి!
పరమ కల్యాణిని పార్వతి నపుడు!
పెండ్లి కూతుగ జేయ బ్రీతి బూనుకొని!

తెల్లావగింజలు దీరు పాపటను
దూర్వా ప్రవాళంబు దోబూచులాడ!

అతిశయ శోభలు నందాలు జింద
వెలిబట్టు జీరను వేడి ధరించి!
క్షత్రియాచారమౌ శరము జే బట్టి
అభ్యంగస్నానాని కతివ వే వెసలె!
స్నానగృహంబునను సౌందర్య మొప్ప!
చంద్రకాంతుల వెల్గు సాంద్ర రాత్రి వలె!

అట్టి దీక్షావిధి యా శై[illegible]!
యూరి బాణంబును హస్తముం బట్టి!
బహుళాంతసానాన భాను కాంతులను
సంపర్కమును బొంది సరసత్వమునను!
ఉదయించు చంద్రుని యుద్దీప్తరేఖ
చారుసుందరతను సౌందర్య మొప్పె!

[illegible]ధ పుష్పములచే లోలత జింద
నలుగుల నిడి రంత నాతి నెమ్మేన!
గంధద్రవ్యములచే గమనీయ మగను
బై పూత దీర్చిరి బరిమళ మెసగ!
స్నాన యోగ్యంబగు సర్క్రొత్త వలువ!
ధరియింప జేసిరి తరుణి పార్వతికి!
స్నానగృహంబునకు సరసతి జింద
గొనిపోయి రంతట కోమలాంగులును!

ముత్యాలు దాపిన ముద్దుల నోలకు
వైడూర్య శిలయందు వైభవ మొప్ప!
కూర్చుండ జేసిరి కూర్మి నా గిరిజ
మంగళ తూర్యముల్ మ్రోగు చుండ!

బంగారు కలశాల రంగారు చున్న
పూతసలిలంబుల పుణ్య తీర్థముల
పెడ్లికూతును జేయ జేర్చితో నపుడు
జలకమాడించిరి జలజాక్షు లపుడు!

మంగళ స్నానముల మాధుర్య మొలుక
నిర్మలినాంగియై శిఖ కేశ్వ రపుడు!
ధౌత వస్త్రంబును దనువున దాల్చె
బర్దస్య వృష్టిచే బరగ భూమాత!
రెల్లుబూవులతోడ జల్లుగా విరియు
వసుధలా నొప్పారె వంద యందాల!

అంతట ముత్తయిదు లలరి పార్వతిని
హృదయాని కత్తుకొని పొదవి వె తెరల!
స్నానగృహము నుండి సరసత నపుడు
మణులచే దాపిన మహనీయమైన
నాలుగు స్తంభాల నవసౌంపు లొలుకు
కౌతుక వేదిక కడకు గొనిపోయి
కూర్చుండ జేసిరి కూర్మి నా గిరిజ
బొట్టు కాటుక దిద్ద బూనికొని రపుడు!

ఆ ప్రదేశము నందు నట్టి పార్వతిని
తూర్పు దిక్కునగాగ కూర్చుండ జేసి!
ఆ యువ యందాలు నా శోభజూచి
నివ్వెఱ వోయిరి నెలత లందఱును!
కాటుక కుంకుమల్ కస్తూరి నగలు
బ్రక్కనే యున్నవి నక్కజంబుగను!

గిరిజపై దృష్టిని కేంద్రీకరించి
ఒక క్షణం శాగిరి యొయ్యారముగను!

సాంబ్రాణి గుగ్గిల సరస ద్రవ్యముల
తడి కురు లార్చిరి తరుణులు వంత!
కేశపాశము గూర్చి యీశున కింపు
గూర్చు విధంబున గూర్మి పుష్పములు!
దూర్వా చిగుళ్ళ మధూక బుష్పముల
మాలను దురిమిరి మహిత గురులందు!

తెల్లనగు నగరుల దీర్చి మైపూత
సైరంధ్రు లపుడు వేసెను రీతిగను!
గోరోచనా పత్ర కూర్మి శిల్పముల
ఉమ మేనిపై వ్రాయ వయ్యార మొప్ప!
చక్రవాకంబుల సైకతంబుగను!
నాకాశ గంగవలె నాయుమ మేను!
చిత్రశాలకు వోలె శిల్పాలయముగ
కాంతుల శోభిల్లె గలికి దేహంబు!

భ్రమరములతో నున్న పద్మకాంతులను
మబ్బుల రేఖలను మాధుర్య మొలుకు!
శశిబింబ సౌందర్య చారు సుందరత!
భూషితాలకలతో బులకించు చున్న
గిరిజ ముఖ తేజస్సు క్రిందుగా జేసె
ఉపమాన సాదృశ్య మూహింప లేము!

ఆ దేవి పార్వతి యల కపోలములు
లోధ్ర పుష్పములతో లోలత్వ మొలుకు

తెల్లనై యున్న యా తమ్మిపూ రేకు
పసుపు కాంతులతోడ బంగారు శోభ!
గోరోచనముతోడ గూర్చిన వన్నె
కర్ణముల నుంచిన కాంతులు జిందు!
యువ ప్రహోహాంబట యందాలు వెలయు!
సంధ్య కాంతుల వలె సరసత నొప్పె!
చూపరుల్ దృష్టిని జూఱలు గొనగ
నా కట్టుకొనుచుండె నా యువ మోము!

ఆ యువ యధరోష్ఠ మా సమయమందు
మైనపు బూతల మాధుర్య మొలికె!
మెఱుగుల జిందుచు మేల్మి బంగారు
కాంతుల నపుడొప్పె కమనీయముగను!
సౌందర్య ఫలముల సరసతం బొంద
ఆసన్న సమయంబు నాయె నటంచు!
విడివడు రేఖగా వేయి దీపాలు
వెలిగిన రీతిగా వేడుకం గొలిపె!

రమణీయ శోభల రమ్య కాంతులను
నల్వగల్వల బోలు నాతి కన్నులను!
అందాలు గూర్చగ నతిశయ మొప్ప
యతివలు కాటుక నలరింప లేదు!
కల్యాణ ప్రదమని కాంతలా యువకు!
కాటుక దిద్దిరి కమనీయ గతుల!

ఆ మహా దేవికి యా గౌరి కపుడు
బారాణి దీర్చిరి బహుతు లందఱును!
లోక కల్యాణమున లోక రక్షణకు
శివునితో బాటుగ శివరాణి గూడ!
ప్రతిన బూనిన యట్లు పాదముల్ జెలగె!
మంగళ మధురిమల్ మాధుర్య మొప్ప!

అంతట నా గౌరి కాభరణముల
సొంపులు గూర్చిరి సుదతు లందఱును!
లలిత మంజుల సుమ లతవోలె నొప్పె!
రమణీయ సుడుగణ రాత్రిలా దోచె!
రాజహంసలు గూడు రమ్యమా నదిగ
లలితభూషల తోడ లలితాంగి యొప్పె!

సుందరంబై బహు శోభలం జిందు
దర్పణం బందున దన రూపు గాంచి!
ఆనంద తాండవ మందె లో లోన
హరుని రాకకు యుమ యారాట మందె!
నెలతల కందాలు నిండు శోభలును!
ప్రియదర్శనమునెగా బొలుపుల జిందు!

అటుల ప్రసాధన మా యుమ కలర!
తల్లి మేనక వచ్చి దన్మయ మంది!
మాంగల్య మంగళ మహిమల నొప్ప
హరితాలక ద్రవ మంగుళు లమర!
మనశిల బట్టుక మధురిమల్ జిందు
బిడ్డ నెమ్మోమును ప్రేమతో నెత్తి!

నారదు వచనంబు నాటి నుండియును
తనబిడ్డ కోరిక తనదు కోరికయు!
చిగురుగా ఆకుగా జెన్నొంద బూవై
ఫలమౌట గనుగొని బరగ యా మేన!
తన కూతు మోమున దనరిన దీక్ష
పెండ్లి బొట్టును దిద్దె ప్రేమతో నవ్వుచు!
పొరిబొరి యశ్రువుల్ బొంగారు చుండ
ముద్దుల పట్టికి ముదముగా మేన
పెండ్లి తోరంబును ప్రేమతో నవ్వుచు
నొక చోటునకు గాను నొకచో నమర్ప
దాది తా ప్రేళ్ళతో దగ సరిజేయ!
గారాబు పట్టికి గరమందు గట్టె!

సరిక్రొత్త తెలిపట్టు జీరను గట్టి
చేత దర్పణమును సింగార మొప్ప!
ధరియించినట్టి యా గిరిజ సుందరత
సంధ్య వెల్గుల వోలె సరసత నొప్పె!
జాలుతో దొలుకాడు పాల సంద్రంబు
తీరము వలె యుమ విరిసె సొంపులను!
పూర్ణచంద్రుని తోడి బుల్కాలం జిందు
శారద రాత్రిగా సఖి యుమ యొప్పె!

కర్మోపదేశముం గార్య నిర్వహణ
దక్షులైనట్టి తన్వి యా మేన!
కులప్రతిష్ఠాభూత కూతు బార్వతిని
గుల దేవతల కెల్ల గూర్మి మ్రొక్కించె!

వరుసగా సతులకు వన్నెల జింద
బాదాభివందన బరగ జేయించె!

పాదాభి వందన బార్వతీ సేయు
యలరి యా సతులంత నాశీర్వదింప!
సంపూర్ణమైన యా సర్వేశు ప్రేమ
పొందగా నందగా బొలతులు వలుక!
సంపూర్ణమైన యా సర్వేశు ప్రేమ
పొందుటే కాదుసూ! పొలతి యా హరుని!
అర్థ శరీరంబు నాక్రమించుటను!
దరుణుల దీవెనం దలక్రిందు వఱచె!

ఆ హిమవంతుడు నా యద్రిరాజు!
తనదు సుతోత్సాహంబు దనదు నైశ్వర్య
సంపదన్ దగునట్లు సకలంబు జేసి!
పెండ్లి గూతును జేసి పేర్మి తనపుత్రి!
బంధుజనంబుల బరిజనంబులను!
ఆ వృషభధ్వజుని యా పరమ శివుని
ఆగమనమునకై యలరుచు నుండె!
వీక్షించు చుండెను వేడుక మీర!

ఆ సమయంబున యపురూపముగను
కాంతులు జిందేటి కైలాస మందు!
సందడివడుచున్న సప్త మాతృకలు
ఆ పురశాసను కనురూప మైన!
పెండ్లి ముస్తాబుల ప్రియముగా దెచ్చి
ముందుంచి రప్పుడు ముదము తోడుతను!

ఆ బ్రహ్మ మున్నగు నా మాతృకలపై
గారవముల చేత గౌరీశు డపుడు!
మంగళప్రదమైన మండనంబులను!
గరముచే స్పృశియించె కమనీయముగను!
ఆ శివు వేషమే యపురూపముగను!
వరుని వేషంబుగా వన్నెలం జిందె!

అంగరాగం బయ్యె నారు భస్మంబు
సిత చంద్రకాంతుల తేజస్సు తోశికె!
ఆ కపాలంబయ్యె నతిశయంబుగను
అసుల శేఖర మాయె నా మహాశివుకు!
ఆ గజ చర్మంబె మాంసాది చిహ్న
పసుపు పచ్చనిరంగు బంగారు వన్నె
పెండ్లి దుకూలమై ప్రీతి నొప్పారె!
ఆ శివు వేషమే యపురూపముగను
వరుని వేషంబుగ వన్నెలం జిందె!

ఆ చంద్రమౌళికి యా త్రిలోచనుకు
పసుపు కాంతులు జిందు బంగారు వన్నె!
లలి లలాటమునందు లావణ్యముగను
నగ్నులు నిండిన యా విలోచనము!
హంతాల తిలకమై యందాలు చిందు
పెండ్లి బొట్టుగ మారె ప్రియమార నపుడు
ఆ శివు వేషమే యపురూపముగను!
వరుని వేషంబుగా వన్నెలు జిందె!

అంగాంగముల యందు నలరి యున్నట్టి
భుజగేశ్వరుల యొక్క పూత దేహములు!
రూపాంతరము నొంది రూఢిగా నవుడు!
హారున కాభరణాలు నాయె నంతటను!
వికృతి నొందెను గాని విమల దేహములు
ఫణరత్న శోభలు బరగ నట్లుండె!
ఆభవు వేషమే యథ రూపముగను!
వరుని వేషంబుగా వన్నెలం జిందె!

పట్టుపవలును గూడ బల్లవించుచును
కిరణ కాంతులు జిందు కీర్తిదాయకుడు!
బాలభానము జేత బంగారు కళల
మచ్చతేనటువంటి మాధుర్య మూర్తి!
మౌళిపై నటియించి మధురిమల్ జిందు
బాలచంద్రుడే యున్న ప్రభుని కింకే ?
మఱియొక మణి యేల మాధుర్య మొలుక?
రత్నమొకటేల యింక రంజిల్ల జేయ!
ఆ శివు వేషమే యపరూపముగను!
వరుని వేషంబుగా వన్నెలం జిందె!

అట్టి విధంబున నా యీశ్వరుండు
తన ప్రభావముచేత దగ ప్రసిద్ధముగ
తన వేషధారణ సవరించుకొనుచు
ఆ స్థితి సంహార యా లయకర్త
ప్రముఖులు దెచ్చిన బలు తేజమైన
అద్దంబు నందున గనెను నెమ్మోము!

ఒయ్యార నడకల యోర జూపులను!
నా పరమేశ్వరు నటు మోయుచుండె!

ఆ వృషభేంద్రుని కా శివ సృష్టి
ముందుకు నడువగా మోదంబు మీర!
ముకుదారమో యన ముంగురు నడిపె!
ఆ హిమవంతుండు నెరి పాలించు!
ఓషధీ ప్రస్థంబు నొక మహాద్వారమున
జేరెను సంతసం విరిసె ప్రాణాన!

ఆ నీలకంఠుని యందాలు గనగ
నగరోపకంఠాన నయము జనాలు!
అలరిగూడిరి గుమి యతిశయం బొప్ప
వరుని యందాలను వరుస గన్గొని!
ఉత్సాహవంతులై సుమ్ముఖులైన
జనులు గన్గొనుచుండ శంకరుం డంతె!
ఆకాశ మార్గాన నంతట నొదలి
భూతలంబును జేరె భువి సంతసింప!

బంధుజనంబులు పరిజనంబులును
గజబృందములతోడ గంటల ధ్వనుల!
ఆ చంద్రమౌళికి నెదురేగియున
గిరిచక్రవర్తి తన కీర్తి వైభవము!
పూచిన ప్రేమను బోయు చెరియును
నచ్చుచున్నటు లుండె నాలయముగను!

పురద్వారమును జేరగ బూరకల తోడ
కలకల మెసయెడి గంభీర ధ్వనుల!

ఆ మహాదేవుని యా మహీధరుని
ఉభయ వర్గంబులు ను త్తేజ మెసగ!
మెండుగా బారలిన రెండు బాహువులు
కౌగిలిని యేకమై గదిలిపట్లుండె!

విశ్వకల్యాణుండు విపుల భాసకుండు
ఆ మహాదేవుండు నా త్రిలోచనుడు
తనకు బ్రణమిల్లె నని విస్మయ మందె!
హిమవంతు డప్పుడు హ్రీమంతు డాయె!
అత డెఱుగడు పాప మాతకు ముందె
తన తల వంచుట తగు నమస్కృతుఁ!

ఆనందమున దేలు నా గిరిరాజు
అల్లుడై నటువంటి యా మహాశివుని!
అఖిల లోకేశ్వరు నానందమయుని
అగ్రభాగమున నడిచి యతిశయం బొప్పె!
అఖిల సంపదలతో నలరిన యట్టి
రమణీయ మైనట్టి రాజమార్గముల
చలువ పందిళ్ళతో జక్కనైనట్టి
ముత్యాల ముగ్గులు ముద్దులై యున్న
రత్నాల రాళ్ళతో రమ్యమైనట్టి.
చీనిమంటలు మున్గ పూమార్గముల
అల్లుని గొనిపోయె నటుల దా గృహము!

ఆ శుభ సమయంబు నా మహారాత్రమున
పురసుందరీ మణుల్ బురకాంత లంత!

హరుని దర్శించుట కఖిలంబు మఱచి
ప్రాసాద మాలల భవ్య ద్వారముల!
వీక్షించు కాంతల వింతలి ట్లుండె!
గనుచున్న లేమల గాథ లిట్లుండె!

ఈశు సందర్శింప నిటలాక్షు జూడ!
సుందరి యొక్కర్తు సురుచిరంబుగను
చెలగి గవాక్షముం జేర వచ్చుటను
బూలతో జారిన బొలువు గ్రొమ్ముడిని!
చేతబూనెను గాని జేష్టితము దక్క!
ముడువంగ దలపదు ముద్దుల గుమ్మ!
అఖిలేశు పరమేశు నా సదాశివుని
వీక్షించు గాంతల వింతలిట్లుండె!

చరణాగ్రముల యందు విరియు లత్తుకను
తడియార కుండగనె దరుణి యొక్కర్తు!
దాసి చేతులనుండి త్వరితంబు లాగి
పూని గవాక్షమున్ బొలతి జేరగను!
త్రోవ పొడ్గున నాయె తొయ్యాలి పాద
లత్తుక గుర్తుల లావణ్య మొప్పె!
కెందామరలు నట కెంపులు విరిసె!
మందార పూవుల మాన్యత యొప్పె!
అఖిలేశు బరమేశు నా సదాశివుని
వీక్షించు కాంతల వింతలిట్లుండె!

కల్వగన్నులు గల కాంత యొక్కర్తు
అద్దము గన్గొంచు సతి సుందరముగ

కుడికన్ను గాటుక గూర్చె నింపుగను
హరుడొచ్చె వరుడొచ్చె! యను వార్త వినుచు!
వరుని వీక్షింపంగ వాల్గంటి యపుడు
వాతాయనంబున కొడివడి వచ్చె!
వామనేత్రం బపుడు వంచితం బాయె!
కాటుక భరిణయు కరమునం దుండె!
అఖిలేశు బరమేశు నా సదా శివుని
వీక్షించు గాంతల వింత లిటులుండె!

లేడి కన్నులు గల్గు లేమ యొక్కర్తు
మణిమేఖలను గూర్ప మధురిమల్ జింద!
హరుడొచ్చె! వరుడొచ్చె! యనుచు వినరాగ
తడబడి బరువున దరుణి వేరాగ!
సగము గ్రుచ్చిన మాల సరస రత్నములు
నొక్కటొక్కటి రాలె చక్కనీ నేల!
వాతాయనమునకున్ వాల్గంటి వోవ
సూత్రమొక్కటి నుండె జోద్యముగ జేత!
అఖిలేశు బరమేశు నా సదాశివుని
వీక్షించు గాంతల వింతలిటు లుండె!

అద్దాల మేడ నొక యందాల భరిణ
శివుని వేషము దాల్ప జెన్నగా నపుడు!
నుదుట భూతిని దాల్చి నొసట కుంకుమను!
మూడవ నేత్రంబు ముద్దుగా దిద్దె!
కురులపై కెగగట్టి కూర్మి జూటముగ
బంగారు చంద్రుని భామ ధరించె!

వరుడన! శివుడన! వాతాయనమున
దొంగి జూడగ నెంత దోరంపు జెలులు!
వీధిజను లందఱు వింతగా జూడ!
వాతాయనవు దెర నగలాడి దింపె!
అఖిలేశు బరమేశు నా సదా శివుని
వీక్షించు గాంతల వింత లిటులుండె!

ఈరీతి పురమున యింతి పూబంతు
లతి కుతూహలమున యా శివు జూడ!
వాతాయనంబుల వన్నెలం జిలుక
కమనీయ దృశ్యంబు గానిపించెనుగ!
ఆసవగంధముల్ వలరెడి నట్టి
చంచల నేత్రముల్ చలిత భ్రమరములు
నైన యా వదనముల్ నతి సుందరముగ
పద్మ సౌందర్యంబు భాసించె నంత!
ఆ గవాక్షములన్ని యలరె జిత్రముగ
బద్మ మాలకు వోలె బహు సొంపు లొలికె!

ఆవిధ మా శివుండట్టి పగలందె
ప్రాసాద శృంగముల భవ్యంబు లందు!
పురజనంబుల మది బున్నమి నాటి
వెన్నెలల్ నింపుచు వేడ్కతో నవుడు!
ఎత్తిన జెండాలు ఉత్తోరణములు
అరటి స్తంభాలతో నందాలు జిందు!
పన్నీరు జల్లిన బహు సువాసనల
రాజమార్గము జేరె రమణీయముగను!

ప్రాసాద శృంగాల ప్రమదల కప్రుడు
హరుని వీక్షించుచు నానందముగను!
విషయాంతర ధ్యాస పిసము లేక!
కనుల గ్రోలెడు నటు కాంతల కుండె
సకలావయవముల సర్వావృత్తులును
జక్షురింద్రియమున జేరె గాబోలు!

చూడవే చూడవే సుందరీ శివుని!
గిరిరాజు నల్లు డదె! గిరిపుత్రి మగడు!
ఈ పరమేశ్వరు నీ త్రిలోచనుని
బరిణయ మాడగా బతిగ నందగను!
అతి సుకుమారియా నా శైలతనయ!
యా తపస్సును జేయ నర్హ మే యగును!
ఈ చంద్రమౌళికి నీమహా పురుషు
దాసియా నే సతి ధన్యయా నామె!
అంకశయ్యను జేరు పతిప భాగ్యంబు!
అంతింత యనిజెప్ప నలవి యెవ్వరికి?

ఇట్టి సౌందర్యముల్ నిట్టి శోభలును
నిట్టి యందాలు గల నీ మిథునమును
జతగూర్ప జాలెగా సరసతన్ బ్రహ్మ
సతిపతులను జేసె సంతోష మలర
అటు జత గూర్చక నెటొ జూచియున్న
విధి సృష్టిచతురత విన్నాణములును
వ్యర్థమై యుండెడి వర్థంబు లేక
వెక్కిరించుందురు వెఱ్ఱి వాడనుచు!

ఇట్టి యుంద్రాలతో నీ చంద్రమౌళి
కోపించి తాపించి కంటజూచి స్మరుని
భస్మంబు జేసెనా? విస్మయం బగునె!
నా మనసు నమ్మదే నళినాయతాక్షి!
కాముడే యీశివు కమనీయ కాంతి
గాంచి దా సిగ్గుతో గనుదేర లేమొ!

ఓ చెలీ ఒకమాట యొప్పుగా జెప్పు
మనరాజు మామయై మన్ననల్ గందె!
ఇట్టి సంబంధాల యింక నీ రాజు!
మాన్యతం బొందునే! మహిమ ఘటించు!
క్షితిధారణోన్నత శిరమున బైకి
మఱికొంత నెత్తుచే మహిమ జెలగి!

ఈ రీతి బలుకుల నిట్టి వాక్యముల
యా యోషధీపురి యతివలు గూడి
మాటాడు మాటల మానముగ వినుచు
చెవులకు సంపును చిత్తంబు సొంపు
రంజిల్ల నాతడు రమ్య మార్గముల
హిమవంతు సదనముం వేడుకం జేరె!

శారద మేఘాల సరస భానుండు
వెలుగున ట్లీశుండు వృషభంబు డిగ్గి!
అమ్మన్నకు గైదండ నరి గైకొనుచు
నా ధాత్రి నడువగా నట్లు నమ్మన!

పెండ్లికుమారుగా బేర్మి హిమవంతు
భవన కక్ష్యను దాటి భవుడు వే జేరె!

ఆ స్వామి వెనువెంట నఖిల దేవతలు
సప్తర్షి గణమును సకలమౌ మునులు!
ప్రమథులు మాతృకల్ విమల భాస్కరులు
ఒక ప్రశస్తారంభ నుత్తమార్థమున
ఒక బృహత్కార్యంబు నొక ప్రయోజనము
సాధింప గిరి యిల్లు విధి బ్రవేశింప!

అంతట నా శివుం డాసనస్థితుడై
యలరు నవరత్నాల యర్ఘ్య పాద్యముల!
మంత్ర పూరితముగా మధుపర్కములను
దగ దుకూలములను నగరాజు చేత!
అర్పింపగా నంత నా సదాశివుడు
స్వీకరించెను లీల జిఱునవ్వు తొలుక!

సిత దుకూలములతో సింగార మొప్ప
యాచంద్ర మౌళిని యా సదాశివుని!
అంతఃపురములోని యల వృద్ధ లపుడు
చంద్రకిరణములు చారు సుందరత
స్ఫుట ఫేన భాసుర సుందరంబైన
క్షీరసాగరమును జిత్రగతి తోడ
వేలా సమీపంబు వేదెచ్చి నటుల!
వధు సమీపంబునకు వడి దెచ్చి రపుడు!

శుక్లపక్షపు చంద్ర శుభ్ర కాంతులను
బొంగారుచున్న యా పొలతి పార్వతిని!

సామీప్యమును బొంది శరదాగమమున
యానంద లోకంబు నలరె యా శివుడు!
వికసించు కన్నుల కలువ పూవులతో
నిర్మలంబను మది నీరంబు తోడ
ఆనంద వాహిని నటు మున్గి దేలె!
నిర్వృతి నొందెను నిముసంబు పాటు!

ఆ పార్వతీ శివుల్ యటు లొక రొకరు!
యాకస్మికంబైన నా సమాగమము!
ఒకరి నొక్కరు జూతు రొయ్యారముగను
సిగ్గుచే దలవంచు జిఱునవ్వు లొలుక!
ఆ జూపు లా సిగ్గు లా జిఱునగవు
దోబూచు లాడగ దొంగి జూడగను
విసువు జనింపదు వేగంబు విడదు!
తనివి సెందరుగదా దగ క్షణమైన!

తన ముందు కొచ్చుట దగ నది బడుచు!
యును శరీరము దాగి యొప్పుగా నున్న!
మదనుని యా ప్రథమాంకురంబుగను
గిరిజ రక్తాంగుళుల్ గిరిరాజు శివుకు!
మంత్రపూతంబుగా మహిమాన్వితముగ
నందీయ గైకొనె నానందముగను!
పూలు వర్షించినవి పుడమి బులకించె
యచ్చర లాడిరి యానందముగను!
కిన్నెరల్ పాడిరి కిన్నరల్ వట్టి
పుష్పాదుల్ రేగెను బుడిమి సంతటను!

చల్లని గాలులు మెల్లగా వీచె!
నిర్మలాకాశమున నీలిమల్ తొణికె!
సుందర దృశ్యముల్ సురచిర ధ్వనులు
దిక్కులు పొడసూపె దిశాన్ని మ్రోగ!
ఆనంద వాహిని యెటు వెల్లివిరిసె
సంతోష సంద్రంబు సరసతిం బొంగ!

గిరిజ కెంగేలును గిరిరాజు శిష్యుని
హస్తమం దుంచగా కలసి రిద్దరును
ఆపాణి స్పర్శచే నాది దంపతులు!
మదన ప్రవృత్తులు మారొక్కెనంత!
సమ విభక్తం బయ్యె సరిసమానముగ
సంగట్లు కరిగె నాక్షణ మందు
స్వేదము గుబార్పాటు జెన్నొందె నంత!
సాత్త్విక భావముల్ సరసతి విరిసె!

ఏ వివాహమునందు నే వధూవరుల
యెవరి సాన్నిధ్యంబు నెవరి కృపవలన!
దాంపత్య ధర్మంబు ధన్యమై వేయు!
పరిణయ శ్రీలతో బండి మోకెత్తు!
ఆ యాదిదంపతు లా పెండ్లి విభవ!
మెటుల వర్ణింపగా నెటు దెప్పదగును!

ఆ యుదర్శి కృశాను నగ్ని దేవునకు
ప్రాదక్షిణంబును బరగ జేయుచును!
ఆయాది దంపతు లట్టి మిధునంబు!
మేలు పర్వతమును మేలుగా జుట్టి

తిరుగుచు నన్యోన్యన్య దీర్ఘంబు లాడు
రాత్రిం బవళ్ళుగా రంజిల్లి రంత!
ఆ యాది దంపతు లా పెండ్లి విభవ!
మెటుల వర్ణింప దగు? నెటు దెప్పదగును?

అన్యోన్య సంస్పర్శ నలరు బుల్కలచే
యానంద వాహిని యందు దేలుచున్న!
ఆనవ దంపతు లగ్నిహోత్రునికి
ప్రాదక్షిణంబుల బరగ ముమ్మారు!
ఆచరింపగ జేసి యా పురోహితుడు!
వధువుచే జేయించె నొప్పుగా నపుడు!
ఆ సమిద్ధార్చియం దగ్ని కుండమున
లాజ హోమంబును లక్షణంబుగను!
ఆయాది దంపతు లా పెండ్లి విభవ!
మెటుల వర్ణింపదగు నెటు దెప్పదగును?

ఆ పురోహితు నాజ్ఞ యగురు వాసనల
యాలాజ ధూమంబు నెరి దోయిలిని!
నెమ్మోము కద్దుకొనె నెలత యా గిరిజ!
ఒక ముహూర్తము బాలు యొనరె శోభలను!
చెక్కిళ్ళ కెగప్రాకు చిక్కనీ ధూమ
శిఖలు కర్ణములకు జిందె గల్వలుగ!

లాజ ధూమము జేత లావణ్యగింజ!
చారు కపోలముల్ విరిసె జెమ్మటను!
ఎఱ్ఱగల్వల బోలె నొఱుపులు గ్రమ్మె!
కన్నుల గాటుకల్ కఱిగి వే చెదరి!

కర్ణావతంసముల్ కనలి పోయెనుగ!
వింతకాంతులు జూపె కాంత మోమునను!
ఆయాది దంపతులా పెండ్లి విభవ
మెటుల వర్ణింపదగు నెటు దెల్పదగును?

అంతట నధువుతో నాద్విజుం డిటుల
ప్రేమ నాశీస్సు ప్రియముతో బలికె!
తల్లి ఓ కల్యాణి! తనయ! ఓ గిరిజ!
నీ వివాహంబయ్యె నిశ్చితంబుగను
ఈ వహ్నియే సాక్షి యింతటి నుండి
భర్తయగు శివునితో బాంధవ్య మొప్ప!
సహధర్మచర్యల సాధింపు మమ్మ!
అఖిల లోకములకు నమ్మవై వెలగి!

అతితాప సంతప్తమగు భూమితల్లి
తొలిచిన్కు పడినంత దొరయు యానంద
మా యుమ బొందెను నా పురోహితుని
యతిశుభకరములౌ నా వాక్యములను!
ఆలోచనాంతము నాకర్ణముగను
గురు వాక్యముల గ్రోలె గూర్మి నమ్రతను!

అంతట శాశ్వతుం డా మహాశివుడు
ఆ ప్రియదర్శను డా యుమ నపుడు!
ధ్రువదర్శనమునకై తొందర వెట్ట
ఉత్తర దిక్కున కొయ్యారముగను!
మొగమెత్తి యా యుమ ముద మలరంగ!
తెరసిగ్గులను మున్గి దేరుచు గొంత!

'చూచితి' నని వల్కె సుదతి సన్నముగ!
ముత్యాలు రాలెను ముదిత బల్కగాను!

విధి ప్రకారంబుగ వేదయుక్తముగ
శివపార్వతుల పెండ్లి జేసి చిత్రముగ!
ఆ పురోహితు డంత నా దంపతులను
బూజ్యుల పెద్దల బుణ్యకాంతలకు
అభివందనము జేయు నాజ్ఞను జేసె
అటుల యాదంపతు లాదిమిధునంబు
పద్మాసనస్థుడగు బరమేష్ఠికపుడు!
వందనంబులు జేసి యొసగ గౌరవము!

అంతట నా ధాత యలరి సంతసము
వీరప్రసవవు గమ్ము! వీరమాతవుగ!
వధువును దీవించి వరు శివు జూచి
వాచస్పతియు నయ్యు వాలాయముగను!
ఎటుల దీవింపగా నేమని పలుక
మాటలు దోపక మౌనముం దాల్చె!

అటు నమస్కృతులతో యావధూవరులు
పువ్వులం గూర్చిన బూతమైనట్టి!
చతురస్ర వేదిని చారుసుందరము
కనకాసనములను గదు వేడ్క గూడి!
లౌకికాచారముల్ లాలిత్య మెసగ
ఆర్ద్రాక్షతారోపణముల మున్గిరిగ!
అట్టి సమయమునందు నా విష్ణు పత్ని
ప్రతాంత లగ్నమా బహుకాంతు లొలుకు!

జలబిందువుల తోడ చారు శోభలను
ముత్యాల మురిపాల ముద్దులం గొలుపు !
కమలాతి పత్రముగ గరమునం బట్టి
అందాలు సమకూర్చె యా దంపతులకు !

ఆ సమయమునందు నా సరస్వతియు
సంస్కృత ప్రాకృత సరస భాషలను !
రెండు విధములు మెండుగా జదివి
ఆ యాది మిథునంబు నలరి కీర్తించె !
సంస్కార పూతమౌ సాధు మార్గమున
వరుని కీర్తించెను వన్నెలం జిందు !
లలిత వాక్యములతో లాలిత్యముగను
వధువును బాడినది వయ్యార మెసగ !

పంచ సంధుల తోడ బరగ కైశిక్య
వృత్తి భేదముల తో వివిధ శృంగార !
రసముల వాసంత రాగంబు లలరు
అప్సర లాడిన యా నాటకమును !
ఆ శివ పార్వతుల లా వధూవరులు
ఒక ముహూర్తము గాంచి రొప్పుగా నపుడు !

ఆనాట కాంతమున యలరి దేవతలు
బరిణయ మాడిన బరమేశు నపుడు !
మదనుని దర్పను మన్నింపు మనుచు
అంజలి ఘటియించి నలరి వేడిరిగ !
శాపావసానము సరగున నిచ్చి
పంచబాణుని సేవ బరగ గొను మంచు !

అటు సురలా శివు నలరి ప్రార్థింప
విగత క్రోధను డయి విమల భావమున !
మదనుడు జీవింప మఱల బ్రతుకుటకు
తన పూల బాణాల తనపైని గూడ !
అలరి గుఱ్ఱెట్టుట కంగీకరించె
కార్య దక్షులు దగు కాలంబు నందు !
జేసిన పనులు జెరిగిపో వెపుడు
ప్రభువులు మన్నింత్రు ప్రార్థనల్ గృపను !

అంతట నా శివు డా దేవతలకు
వీడ్కోలు నిచ్చెను విమల భావమున !
తరువాత నా శివుడు తరుణి పార్వతిని
గరమును జేపట్టి గమనీయ గతిని !
కాంచన కలశముల్ గడురమ్యమైన
బూలతో గూర్చిన బొలుపులం జెందు !
భూమిపై బఱచిన బున్నాగ పూలు
తల్పంబు గూర్చిన దగు మందిరంబు !
ఆయాది దంపతుల్ నలరి జేరిరిగా
శంఖముల్ మ్రోగినవి జారుసుందరత !

నవ పరిణయమున నాట్యంబు లాడు
సిగ్గులం జెందెను శ్రీమహాగౌరి !
శివుడంత తనవైపు సతి మోము దీర్చి
ఓంకార రూపిణి యోరగా దిప్పె !
మాటాడ కున్న యా మాణిక్యరాశి
ప్రమథుల వికృతుల్ బలు జేష్ట లాలికి !

పార్వతిం సవ్వించె పరమేశు డప్పుడు
మంగళ దీపముల్ మాధుర్య మొలికె!
పుడమిని బఱచిన పూలు నవ్వినవి!
కోకిల పాడెను కుహుకుహు ధ్వనులె!

ఫ ల శ్రు తి

ఈ సుందరంబైన యీశు పార్వతుల
పరిణయ గాథను పరగ నెవరైన!
వినినను జదివిన విమల భావమున
ఆనంద ఫలములు నందు వారలను!
శుభములు దరిజేరు శోభలు జిందు
సకల సంపదలును సర్వార్థములును!
కరతలామలకమై కాంక్షలు దీరు
ఫలవృక్షముల వోలె పరగ జీవింత్రు!
ఉదయసంధ్యల వోలె నొప్పు జీవితము
బంగారు పూవుల బాటలు వెలయు!

సప్తమాశ్వాసము సమాప్తం

సంపూర్ణం



# ఇతర గ్రంథములు

ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయసంస్థవారి యనుమతి పొందబడినవి.
గ్రంథము లన్నింటికి పై రేటు నంబర్లు గలవు.

| | | | |
|---|---|---|---|
| 1. | విజయ మంగళమ్ (గీతములు) | 4 | 00 |
| 2. | ఆనంద మందళమ్ (గీతములు) | 4 | 00 |
| 3. | నాలో వెలిగే దీపాలు (బాలసాహిత్యం) | 0 | 50 |
| 4. | అందరికీ వచ్చిన కోడలు (నాటిక) | 2 | 00 |
| 5. | ఉత్తరగో గ్రహణము (నాటిక) | 2 | 00 |
| 6. | నాట్యశాల (నాటిక) | 4 | 00 |
| 7. | సరోజినీదేవి - శ్రీకందుకూరి (బుర్రకథలు) | 2 | 00 |
| 8. | భూమితల్లి బిడ్డలు (నాటిక) | 2 | 50 |
| 9. | గోపబాలక శతకము | 1 | 50 |
| 10. | వినయాంజలి (భక్తి వచనములు) | 4 | 00 |
| 11. | వీధి దీపం (వచనగేయ కవితలు) | 4 | 00 |
| 12. | పాలేటి తరగల్లో మల్లి (పాటలు) | 5 | 00 |
| 13. | శ్రీరామచంద్ర సుధ (కీర్తనలు) | 4 | 00 |
| 14. | వీరనారి ఝాన్సీ లక్ష్మీబాయి (బుర్రకథ) | 2 | 50 |
| 15. | కృష్ణదాసి (గేయములు) | 4 | 00 |
| 16. | పూల రథం (గేయములు) | 4 | 00 |
| 17. | శోణ పద్మం (నాటిక) | 3 | 00 |
| 18. | హరిదాసి (శ్రీగోదాదేవి పాటలు) | 2 | 00 |
| 19. | చిగురులు-పువ్వులు (గేయములు) | 4 | 00 |
| 20. | శ్రీఅల్లూరి సీతారామరాజు (బుర్రకథ) | 3 | 00 |
| 21. | ప్రతిధ్వనులు (వచన గేయ కవితలు) | 4 | 00 |



# శ్రీ గిరిజా కళ్యాణము

[మంజరీ ద్విపద గేయము]